శ్రీమతే రామానుజాయ నమః



# అలర్మేల్మంగై ప్రపత్తి- అలర్మేల్మంగై మంగళాశాసనము సవ్యాఖ్యానము

వ్యాఖ్యాత

న్యాయవేదాంత విద్వాన్
ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామి వారు

న్యాయవేదాంత విద్వాన్
ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి
87వ తిరునక్షత్ర మహోత్సవ జ్ఞాపిక

అలర్‌మేల్‌మంగై ప్రపత్తి-
అలర్‌మేల్‌మంగై మంగళాశాసనము - సవ్యాఖ్యానము

వ్యాఖ్యాత -
ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామి వారు



ప్రకాశనము : మార్చి, 2011
ప్రతులు : 500
వెల : రు. 20/-

సందర్భము :
ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి
87వ తిరునక్షత్ర మహోత్సవము

ముఖచిత్రం : శ్రీపద్మావతి దేవి, తిరుచానూరు
వేదిక : తెలగా కళ్యాణమండపము, నర్సాపురం

ఈ గ్రంథం "శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్", నర్సాపురం
వారు సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడినది

ప్రతులకు :
శ్రీకృష్ణఛారిటబుల్ ట్రస్ట్, 4-1-17/3(2)
కూనపరెడ్డివారి వీధి, నర్సాపురం. ఫోన్ : 9494480283

అక్షరయోజనము : అన్నపూర్ణ గ్రాఫిక్స్, 53/4, ఆర్.ఎస్.గార్డెన్స్, తిరుపతి
ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



# మనవి

జగతి సదా రామానుజసిద్దాంతః పరమవైదికో జయతు ।
దేశికగోష్ఠీ దక్షా తన్నిర్వాహే చ జేజీయాత్ ॥

శ్రీశేషసింహగురువర్యతనూజరత్నం తత్పాదయుగ్మశరణం సుగుణైకరాశిమ్ ।
వేదాంతతత్త్వవిశదీకరణప్రవీణం శ్రీరంగదేశికమహం శిరసా నతో-స్మి ॥

నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళికి నమ్పిళ్ళై అనుగ్రహించిన ఈడు ముప్పత్తారాయిరప్పడివ్యాఖ్య సుప్రసిద్ధం కావడంలో కారణభూతులు ఈయుణ్ణి మాతవ ప్పెరుమాళ్. వీరి వంశానికి చెందిన పలువురు ఆచార్యులు తదనంతరకాలంలో ఆంధ్రదేశంలోని పలుప్రాంతాల లోకి తరలివచ్చి శ్రీవైష్ణవసంప్రదాయప్రచారాన్ని సమర్థవంతంగా నిర్వహించారు. ఆవిధంగా తరలివచ్చిన కుటుంబాలలో ఒక కుటుంబం పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన పెంటపాడులో కొంతకాలంపాటు నివసించిన తరువాత అక్కడనుండి తరలి తూర్పు గోదావరి జిల్లాలోని అంతర్వేదిపాలెం అగ్రహారంలో కొందరు, చిఱతపూడి అగ్రహారంలో కొందరు సుమారు 150 నుండి 200 సంవత్సరాలకు పూర్వం స్థిరపడ్డారు. అంతర్వేదిపాలెంలో స్థిరపడ్డ ఈయుణ్ణి వంశానికి చెందిన ఒక కుటుంబంలో గత శతాబ్దిలో అవతరించిన ఉ॥వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారు ఉభయవేదాంత మహావిద్వాంసులుగా, సౌజన్యమూర్తిగా, అజాతశత్రువుగా పేరు పొందారు. శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామి వారికి, వారి సతీమణి శ్రీమతి శేషమ్మగారికి జన్మించిన అయిదు గురు పుత్రులలో శ్రీమాన్ రంగాచార్యస్వామివారు (శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు) మొదటివారు.

శ్రీమాన్ రంగాచార్యస్వామివారి మాతామహపాదులు నూజివీడు సంస్థాన ఆస్థాన విద్వాంసులు, ఉభయవేదాంతమహావిద్వాంసులు, ఉ.వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారు. అందువల్ల శ్రీమాన్ రంగాచార్యస్వామివారు నూజివీడులో తమ మాతా మహపాదులు ఇంటిలో జన్మించారు. వీరి ప్రాథమిక విద్యాభ్యాసం, కావ్యనాటకాదుల అధ్యయనం తండ్రిగారైన శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి సన్నిధిలో జరిగింది. చిన్నతనంనుండి తర్కశాస్త్రాధ్యయనంలో బలమైన అభినివేశాన్ని కల రంగాచార్య స్వామివారు కొంతకాలం నెల్లూరులో బ్రహ్మశ్రీ ఉడాలి

నుబ్బరామశాస్త్రిగారు, చతుస్తంత్రి ఉ॥వే॥ శ్రీమాన్ కొన్నమూరు రంగరామానుజాచార్యస్వామివార్ల వద్ద ముక్తావళి పర్యంతం ప్రాథమికగ్రంథాలను అధ్యయనం చేశారు. తరువాత విజయనగరం మహారాజా వారి సంస్కృతకళాశాలలో తర్కశాస్త్రాధ్యాపకులుగా పనిచేసి, ఉద్యోగంనుండి విరమించి, తూర్పుగోదావరిజిల్లాలోని అబ్బిరాజుపాలెంలో విశ్రాంతి తీసికొంటున్న బ్రహ్మశ్రీ వేదాంతం శేషయ్యశాస్త్రిగారి సన్నిధిలో పంచలక్షణి, సిద్ధాంతలక్షణి, అవయవి, సవ్యభిచారం, శక్తివాదం మొదలైన ఉద్గ్రంథాలను, వాటి క్రోడాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. కుటుంబంయొక్క అప్పటి ఆర్థికసమస్యలవల్ల ఇంటికి తిరిగి వచ్చిన స్వామివారు కొంతకాలం తరువాత తూర్పుగోదావరి జిల్లాలోని పసలపూడిలో సుప్రసిద్ధ న్యాయశాస్త్ర విద్వాంసులుగా, ఉభయ వేదాంత విద్వద్వరేణ్యులుగా పేరు పొందిన ఉ.వే. శ్రీమాన్ గొడవర్తి శఠకోపాచార్యస్వామివారి సన్నిధిలో శ్రుతప్రకాశికా సహితంగా శ్రీభాష్యాన్ని అధికరించారు. సత్ప్రతిపక్షం వంటి కొన్ని తర్కశాస్త్ర గ్రంథాలనుకూడా వారి సన్నిధిలో చదివారు. ఎవరివద్ద శాస్త్రాన్ని అభ్యసించినా, శ్రీమాన్ స్వామివారికి అధ్యాపనం చేసిన ఆచార్యులందరూ స్వామివారి బుద్ధివైశద్యాన్ని, గ్రహణధారణపటుత్వాన్ని, వివేచనాశక్తిని, వినాయాన్ని చూచి ప్రశంసించేవారు. శ్రీభాష్యాన్ని అధికరించిన తరువాత స్వగ్రామం అంతర్వేదిపాలెంకు తిరిగి వచ్చి, పితృపాదుల సన్నిధిలో శ్రీవైష్ణవసంప్రదాయరహస్య గ్రంథాలను, భగవద్విషయాన్ని, మిగిలిన ద్రావిడప్రబంధ వ్యాఖ్యలను అధ్యయనం చేయడంతో పాటు, శ్రౌతస్మార్త వైదికసంస్కారాల నిర్వహణలో, జ్యోతిషంలోని ముహూర్తభాగంలో, ధర్మశాస్త్రాలలో గాఢమైన పరిచయాన్ని సంపాదించారు.

పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీశ్రీశ్రీ త్రిదండి పెద్ద శ్రీమన్నారాయణ జీయర్‌స్వామివారి, కులపతి ఉ॥వే॥శ్రీమాన్ తె.కం.గోపాలాచార్యస్వామివారి ఆదరాభిమానాలను పూర్ణంగా పొందినవారు శ్రీస్వామివారు. ఒకానొక పర్యాయం నరసాపురంలోని ఆదికేశవ ఎంబెరుమానార్‌స్వామివార్ల కోవెలలో జరిగిన పండిత సదస్సులో శ్రీమాన్ రంగాచార్యస్వామివారు పెద్దజీయర్‌స్వామివారి ఆదేశంపై కప్యాసశ్రుతినిగూర్చి నవీన న్యాయశైలిలో పరిష్కారాలతో ఉపన్యాసం చేయగా, శ్రీజీయర్ స్వామివారు చాలా సంతోషపడి, "న్యాయవేదాంతవిద్వాన్" అనే బిరుదును ప్రసాదించారు. శ్రీ పెద్దజీయర్ స్వామివారు విజయవాడలో ప్రతిసంవత్సరం నిర్వహించిన ఉభయ వేదాంత పండిత సభలలో పలు సంవత్సరాలపాటు తమ పితృపాదులైన ఉ॥వే॥శ్రీమాన్ శేషశింగరాచార్య స్వామివారితో పాటు ఉపన్యాసకులుగా అన్వయించి, పెద్దల మెప్పును పొందారు.



శ్రీమాన్ స్వామివారి ధర్మపత్ని శ్రీమతి సీతమ్మగారు. వీరు స్వామివారికి రెండవ మేనమామ అయిన ఉ.వే. శ్రీమాన్ కిడాంబి శ్రీనివాసరామానుజాచార్య స్వామివారి కుమార్తె. శ్రీమతి సీతమ్మ గారు "పత్నీ సుదక్షిణేత్యాసీత్ అధ్వరస్యేవ దక్షిణా" అనే రీతిలో భర్త అభిమతానుసారం ప్రవర్తిస్తూ, వారికి ఆనందాన్ని కలిగించే సాధ్వీమణి. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె.

శ్రీమాన్‌స్వామివారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవం 1985 సం॥ ఫిబ్రవరి నెలలో అంతర్వేది పాలెంలో ఆత్మీయుల, బంధువుల సమక్షంలో మూడు దినాలపాటు వైభవంగా నిర్వహింపబడింది. (77వ తిరునక్షత్ర పూర్తిసందర్భంగా) 2002వ సం॥లో, (82వ తిరునక్షత్రోత్సవసందర్భంగా) 2006వ సంవత్సరంలో విశేషంగా స్వామివారి తిరునక్షత్రోత్సవాలు నిర్వహింపబడ్డాయి. మళ్ళీ 87వ తిరునక్షత్రోత్సవ శుభసందర్భంగా ఈ ఏడు మూడు రోజులపాటు మార్చి 21, 22, 23వ తేదీలలో విశేషమైన కార్యక్రమాలు ఆత్మీయుల, భక్తుల ప్రోత్సాహంతో నర్సాపురంలో జరుపబడుతున్నాయి.

శ్రీమాన్ రంగాచార్యస్వామివారు నివృత్తిమార్గంలోనే తమ జీవితాన్ని గడుపుతున్నారు. వీరి సన్నిధిలో వీరి కనిష్ఠ సోదరులు శ్రీమాన్ శఠకోప రామానుజాచార్య స్వామివారు కొన్ని సంప్రదాయ గ్రంథాలను అధ్యయనం చేశారు. వీరి జ్యేష్ఠకుమారుడు శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు, ఉ.వే. శ్రీమాన్ గొడవర్తి సుందరరాజన్‌స్వామివారు భగవద్విషయాన్ని వీరి సన్నిధిలో అధికరించారు. తమవద్దకు ఆసక్తితో వచ్చే ఆస్తికులకు, భక్తులకు సంప్రదాయగ్రంథాలను, రహస్యాలను బోధిస్తూ ప్రశాంతమైన జీవితాన్ని నరసా పురంలో శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్‌స్వామివార్ల సన్నిధి సమీపంలో గల స్వగృహంలో గడుపుతున్నారు. ఈ స్వామివారు ప్రతిసంవత్సరం నరసాపురంలో భగవద్రామానుజుల వారి దివ్యాలయంలో జరిగే వారి అవతారోత్సవాలలో తమ పితృపాదులు మెచ్చిన, భాగవతతదీయారాధనను, నాలాయిరదివ్య ప్రబంధసేవాకాల కైంకర్య నిర్వహణను కొనసాగించడంతోబాటు, ప్రతి ఏడు శ్రీమాన్ పితృపాదుల తిరునక్షత్రోత్సవ సందర్భంగా మూడు రోజులపాటు ఉభయవేదాంత పండిత సభలను అత్యంత వైభవంగా నరసా పురంలో నిర్వహిస్తూ ఆచార్యులకు ముఖోల్లాసాన్ని కల్గించే సేవను చేసుకుంటున్నారు.

శ్రీ స్వామివారి వైదుష్యాన్ని, సౌజన్యాన్ని గమనంచిన పలువురు పెద్దలు, సంస్థలు వారిని సమ్మానించాయి. 2002వ సంవత్సరంలో తమ పితృచరణులు ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్య స్వామివారి స్మృతిగా ఉ.వే. శ్రీమాన్ యస్.వి. రంగరామానుజా

స్వామివారు శ్రీమాన్ రంగాచార్య స్వామివారిని సమ్మానించారు. 2005వ సంవత్సరంలో ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి స్మారక సమ్మానాన్ని విజయనగరంలో పొందారు. 2008వ సంవత్సరంలో మహా లక్ష్మీయాగ సందర్భంగా శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామివారు గోపాలదేశిక పురస్కారంతో, 2011వ సంవత్సరంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయరు స్వామివారు గోపాలోపాయన పురస్కారంతో సమ్మానించారు.

సహజంగా నివృత్తిమార్గాన్ని ఆశ్రయించిన శ్రీమాన్ రంగాచార్యస్వామివారు గ్రంథరచనకై ఎక్కువగా ప్రయత్నించలేదు. అలర్మేల్ మంగై ప్రపత్తి, అలర్మేల్మంగై మంగళాశాసనమ్ - అనే రెండు అముద్రిత ప్రాచీన లఘుస్తుతులకు శ్రీస్వామివారు సంతరించిన ఆంధ్రవ్యాఖ్య 2000వ సంవత్సరంలో, 2002వ సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానమువారి సప్తగిరి మాసపత్రికలో ధారావాహికంగా ముద్రింపబడినవి. ప్రస్తుతం వైభవంగా జరిగే శ్రీమాన్ స్వామివారి తిరునక్షత్రోత్సవాల దివ్యస్మృతిగా ఈరెండు స్తుతులు వ్యాఖ్యానంతో పాటు పునర్ముద్రింపబడుతున్నాయి. వీటి ముద్రణభారాన్ని వహించిన శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్, నరసాపురం అభినందనార్హం. ఇంతకుముందు ఈ ట్రస్ట్ద్వారా పూర్వదినచర్యా, ఉత్తరదినచర్యావ్యాఖ్యానం, భగవద్రామానుజుల వైభవాన్ని తెలిపే కొన్ని లఘుస్తుతులు సమాహారరూపమైన శ్రీరామానుజస్తుతి మణిమాల, కూరేశ పంచాశత్ వ్యాఖ్యానం ముద్రింపబడ్డాయి. భవిష్యత్తులో ఇంకా ఇటువంటి గ్రంథాలు మరిన్న ఈ సంస్థ ద్వారా ముద్రింపబడాలని మంగళాశాసనం చేయవలసినదిగా పెద్దలను ప్రార్థిస్తున్నాను. ఆస్తికులైన సహృదయపాఠకులు ఆ స్వామివారి వ్యాఖ్యానంతో కూడుకొన్న ఈ రెండు లఘుస్తుతులను ఆదరిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి.

శ్రీరంగార్యగురూణాం భారద్వాజాన్వయాబ్ధిసోమానామ్ ।
షడశీతివర్షపూర్తేః మధురస్మృత్యై ప్రకాశ్యతే సేయమ్ ॥

తిరుపతి — ఇంతే విన్నపములు

7-3-2011 — ఈ.ఏ. శింగరాచార్యదాసః



# అలర్మేల్మంగై ప్రపత్తి - సవ్యాఖ్యానము

“అలర్మేల్మంగై ప్రపత్తి” అను ఈ స్తోత్రము ఇంతవరకు వెలుగు చూడలేదు. మద్రాసు నగరములోని అడ్డైయార్ లైబ్రరీ 73248 అను నంబరుగల తాళపత్ర గ్రంథములో ఈ స్తుతి లభించుచున్నది. అందలి పాఠమునుబట్టి ఇచటి వివరణము చేయబడుచున్నది. ఈ స్తోత్రము చివర “వానాచలాఖ్యయతివర్య మవేక్ష్య” అని యుండుటనుబట్టి దీనిని వానమామలై యతీశ్వరులను (జీయర్ను) ఆశ్రయించిన పండితులెవ్వరో రచించిరని చెప్పవచ్చును. ఇంతకుమించి దీని కర్తృత్వవివరములను గూర్చి ఏమియు తెలియుట లేదు. ఇందలి శ్లోకములు అన్నియు శ్రీయామున-కూరేశ-పరాశరభట్టారకాది పూర్వాచార్యుల సూక్తులను అనుసరించుచు, రమణీయములైన భావములను వ్యక్తము చేయుచున్నవి. పద్మావతీదేవి, లక్ష్మీదేవియొక్క అవతారమే అగుటచే శ్రీ యామునాచార్యాది పూర్వాచార్యులు లక్ష్మీదేవి విషయమున పల్కిన సూక్తుల భావములను కవి ధర్మైక్యప్రక్రియలో ఇందు పద్మావతీదేవివిషయమున అనుసంధించిరి. పలు ప్రపత్తిస్తోత్రములవలెనే ఈ స్తుతియు వసంతతిలకవృత్త నిబద్ధమై అలరారుచున్నది.



1. యద్వల్లభః పురుష ఉత్తమ ఈశ్వరాఖ్య
శ్శయ్యాసనం ఫణిపతి ర్గరుడస్తు వాహః ।
యత్కింకరా విధిశివప్రముఖా స్సురాస్తాం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

ఎవరి వల్లభుడు ఈశ్వరశబ్దవాచ్యుడగు పురుషోత్తముడో, ఎవరి శయ్య, ఆసనము ఫణిరాజగు ఆదిశేషుడో, ఎవరి వాహనము గరుడుడో, ఎవరికి బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలు కింకరులో, అట్టి, శ్రీదేవికి ప్రతిరూపము, శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణియగు పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకము యామునుల చతుఃశ్లోకిలోని “కాంతస్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరో . . . . బ్రహ్మేశాది సురవ్రజస్సదయిత స్త్వద్దాసదాసీగణః” శ్లోకమును అనుసరించుచున్నది.

(యద్వల్లభః పురుష ఉత్తమ ఈశ్వరాఖ్యః ) ఇచటి వల్లభశబ్దముచే యామునుల సూక్తిలోని కాంతశబ్దముయొక్క భావము పరామర్శింపబడినది. అందుచే “రాఘవో-ర్హతి వైదేహీమ్”, “ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ పావైక్కు” ఇత్యాది ప్రమాణములచే తెలుపబడిన దివ్యదంపతుల ఆనురూప్యము ఇందు స్ఫురించుచున్నది. మఱియు,

భగవానుని "శ్రియఃపతి" అని, "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!" అనియు లక్ష్మీపురస్సరముగా నిరూపించు నట్లే, లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీదేవిని నిరూపించునపుడు "యద్వల్లభః" ఇత్యాదిగా స్వామిని పురస్కరించుకొని నిరూపింపబడుచున్నది. పద్మావతీదేవిభర్త పురుషోత్తముడనుటచే ఆమె స్త్రీలలో ఉత్తమురాలు అనియు తెలియుచున్నది.

"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షరస్సర్వాణి భూతాని కూటస్థో-క్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య భిభర్త్యవ్యయ ఈశ్వరః" అను గీతావచనమునుబట్టి ఇచట "ఉత్తమపురుషః, ఈశ్వరః" అను పదములు ప్రయోగింపబడినవి. పురుషులనబడు బద్ధులకంటె, ఉత్పురుషులనబడు ముక్తులకంటె, ఉత్తరపురుషులను నిత్యులకంటె భగవానుడు విలక్షణుడగుటచే ఉత్తమపురుషుడు. మఱియు "పురు అధికం సతోతీతి పురుషః" అను పురుషశబ్దవ్యుత్పత్తిని బట్టి పరమోదారుడైన స్వామి పద్మావతీదేవి భర్తయని ఏర్పడుచున్నది. మంగళదేవతగా ప్రసిద్ధి చెందిన పద్మావతీదేవికి "మంగళానాం చ మంగళమ్" అని స్తుతింపబడు భగవానుడు అనురూపుడైన భర్తకదా! "యద్వల్లభః పురుష ఉత్తమః" అనుటచే పద్మావతీదేవి భర్త కావుననే స్వామి పురుషోత్తముడయ్యెనను అర్థస్వారస్యము ధ్వనించుచున్నది. అందుచే "శ్రద్ధయా-దేవో దేవత్వమశ్నుతే", "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా", "తిరుమగ్గై తన్నోడుమ్ తికழ్ కిన్ఱ" ఇత్యాది ప్రమాణముల భావము ఇచట సూచింపబడినది. ఇట్లు ఈ ప్రయోగము పలు అర్థస్వారస్యములను ధ్వనింపజేయుచున్నది.

(ఫణిపతిః శయ్యా ఆసనమ్) సర్వలోకమాత యగుటచే, సర్వస్వామిని అగుటచే సకలచేతనులచే ఆశ్రయింప బడుచున్నది-అను అర్థమిచ్చు "శ్రీయతే చాఖిలైః నిత్యమ్" అను శ్రీ శబ్దముయొక్క వేఱొక వ్యుత్పత్తిని శ్లోకములోని రెండవ పాదము వివరించుచున్నది. "భోగీంద్రశయనాసనా" అని లక్ష్మీసహస్రనామస్తోత్రమున ఒక నామము కలదు. పద్మావతీదేవికి ఫణిపతి సేవకుడగుట తగినదే కదా! "నివాసశయ్యాసనపాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః" అని, "శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిజ్గాశనమామ్...... తిరుమాఱ్కు రవు" అనియు ఆదిశేషుడు భగవానునకు సేవకుడని తెలుపబడుచుండగా, ఇతడు పద్మావతికి సేవకుడనుట ఎట్లు? అనినచో, లోకమున భర్తయొక్క సేవకుడు భార్యకును సేవకుడే అగుటచే, భర్తయొక్క సొత్తుకు భార్యకూడ స్వామిని అగుటచే ఇట్లు పల్కుట తగినదే. అంతమాత్రముచే లోకములో ఇద్దరు సొత్తుదారులున్నట్లు తలపరాదు. భగవానుడు సర్వస్వామి. అందులో సందేహము



లేదు. స్వామి తనకు సంబంధించిన సొత్తు తనకు మిక్కిలి అభిమతమైన పద్మావతీదేవికి అధీనము చేయును. భగవానుడు లోకసృష్టినే ఆమె అభిమతానుసారము చేయునన్నచో ఇక ఉభయవిభూతులను ఆమెకు అధీనముగా చేయుననుటలో ఆశ్చర్యమేమున్నది? ఫణిపతిశబ్దప్రయోగ స్వారస్యమునుబట్టి ఉత్తమ శయనమునకు ఉండదగిన ధావళ్యము, శైత్యము, సౌగంధ్యము, సౌకుమార్యము, వైశాల్యము, ఔన్నత్యము మొదలగు గుణములు అన్నియు ఆదిశేషుడను శయనమందు కలవని స్ఫురించుచున్నది. శ్లోకమున శయ్య, ఆసనము- అను రెండు మాత్రమే తెలుపబడినను అవి సర్వవిధ సర్వకాల సర్వావస్థలలో ఆదిశేషుడు చేయు అన్ని కైంకర్యము లకు సూచకములు. "యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ" అనునట్లు ఒక అబల ఒక సోపాధిక భర్తకు పలు రీతులలో సేవచేసెననగా, ప్రకృష్టవిజ్ఞానబలైకధాముడగు ఆదిశేషుడు స్వామినియైన పద్మావతీదేవికి సేవచేయుటలో ఆశ్చర్యము లేదుకదా? శేషశబ్దముచే నిరూపింపబడువాడై, సకలశేషజనులలో అగ్రగణ్యుడైన ఆదిశేషుడు కైంకర్యములలో ముందుగా తెలుపబడుట మిక్కిలి యుక్తము.

(గరుడస్తువాహః) - "సుపర్ణో-పి గరుత్మాన్" అని "వేదాత్మా విహగేశ్వరః" అని పొగడబడు వేదస్వరూపుడగు గరుడుడు పద్మావతీదేవికి వాహనము. లక్ష్మీసహస్రనామముల లోని "గరుడాసనా" అను నామముయొక్క అర్థమిచట స్మరణీయము. "గరుద్భ్యాం డయతే ఇతి గరుడః" అను వ్యుత్పత్తినిబట్టి రెండు రెక్కలతో ఎగురువాడు గరుడుడు. ఇతడు అత్యంత బలిష్ఠములైన, అందమైన రెండు రెక్కలను కలవాడు. కావున సుపర్ణుడయ్యెను. వజ్రాయుధము సైతము ఆ రెక్కలను ఏమియు చేయలేకపోయినది. పెరియతిరువడిగా శ్రీవైష్ణవసంప్రదాయమున పిలువబడు గరుడుడు భగవానుని సేవకులలో చాల గొప్పవాడు. వేదాత్మకుడగుటచే తత్త్వవిదులలో అగ్రేసరుడు. దీనిచే అతని రెక్కలు రెండును జ్ఞానానుష్ఠానములకు సూచకములు. ఇతడు పరమపదమునందు మాత్రమే స్వామికి సేవ చేయుటయే కాక, ఈ లోకమునందును భగవానుని అనుసరించి, స్వరూపానురూపమైన సేవను చేయును. శ్రీరామావతారమున నాగపాశములనుండి విడిపించుట, అమృత ప్రదానము చేయుట, 'అరుళాழிప్పుళ్ కడవీర్ అవర్ వీది ఒరునాళ్' అనునట్లు భక్తులున్న చోటికి దివ్యదంపతులను కొనిపోవుట, అసురుల ప్రాణములను తీయుటలో భగవానునకు తోడ్పడుట - మొదలగు రీతులలో ఆశ్రరక్షణమునందు, తద్విరోధి నిరసనమునందును అనుకూలుడైయుండు కృపాసముద్రుడు ఇతడు. కావున దివ్యదంపతుల విహారార్థము గరుడుడు వాహనమగునని తాత్పర్యము. స్వామికి వాహనమైనచో తత్పత్నియగు పద్మావతికి వాహనమైనట్లేకదా !

ఈనాటికిని తిరుచానూరు పద్మావతీదేవి బ్రహ్మోత్సవములలో గరుడుడు నాల్గవనాడు రాత్రి పద్మావతిదేవికి వాహనమగుట ప్రత్యక్షముగా అందఱు దర్శించుచున్నదే.

"పఱవై యేరు పరమ్‌పురుడా!" అనునట్లు గరుడవాహనత్వము భగవానుని సర్వాధికత్వద్యోతకమగునట్లే, పద్మావతీదేవియొక్క సర్వాతిశాయినత్వమునకును ఇది సూచకము. "ఫణిపతిః శయ్యా ఆసనం గరుడస్తు వాహః" అనుటచే పరస్పరవిరుద్ధ జాతులకు చెందిన ఆదిశేష-గరుడులవలన ఒకేసారి ఎట్టి విరోధము లేకుండునట్లు కైంకర్యమును స్వీకరించు పద్మావతీదేవియొక్క అఘటితఘటనాసామర్థ్యము సూచితము. "పుట్కొడియాయ్! తీవాయ్ నాకణైమేల్ తుయిల్‌వానే ! తిరుమాలే" ! అనుచు పరకాలసూరి భగవానుని విషయమున పరత్వచిహ్నములను గరుడధ్వజత్వము, అనంతశాయిత్వము, శ్రియఃపతిత్వములను కలిపి అనుసంధించినట్లే, కవి ఇచట పద్మావతీదేవివిషయమున విష్ణుపత్నీత్వ, శేషశాయిత్వ, గరుడవాహనత్వములను వరుసగా స్మరించిరి అని అనదగును. శ్లోకములో వాహనత్వము మాత్రమే చెప్పబడినను అది - "దాసస్సఖా వాహనమాసనం ధ్వజో" -- ఇత్యాదిగా గరుడుడు చేయు సకలవిధసేవలకు ఉపలక్షణము. అట్లే, ఆదిశేషుడు, గరుడుడును పద్మావతీదేవిని సేవించుటను తెలుపుట మిగిలిన నిత్యసూరివర్గము అంతయూ ఆమెకు శేషమై యుండుటకు సూచకము. ఈ విధముగా ద్వితీయపాదము బహ్వర్థద్యోతకము. ఇందు పద్మావతీదేవియొక్క నిత్యవిభూతిస్వామినీత్వము తెలుపబడినదని స్మరింపనగును.

(యత్కింకరా విధిశివప్రముఖాః) ఇందు లీలావిభూతి అంతయు - అనగా - పరమపదముకాక మిగిలిన లోకము లన్నియు పద్మావతీదేవికి శేషమై యుండుట తెలుపబడుచున్నది. ఈ విధముగా ప్రస్తుత శ్లోకములోని రెండవ, మూడవ పాదములలో శ్రీ శబ్దముయొక్క కర్మణి వ్యుత్పత్తి- అనగా- "శ్రీయతే అఖిలైః" అను వ్యుత్పత్తి వివరింపబడినది. ఇచట దేవతలలో బ్రహ్మ, శివుడు మాత్రము తెలుపబడుటకు వారు "ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ సృష్టిసంహారకారకౌ" అనునట్లు సృష్టిసంహారకార్యములకు అధిపతులగుట కారణము. అట్టి బ్రహ్మ రుద్రాదులు సైతము కైంకర్యమును చేయుట, వారి పత్నులు, దేవతలు తత్పతీగణము, మిగిలిన లోకములలోని సమస్తచేతనవర్గము పద్మావతీదేవికి శేషమైయుండుటయు అర్థాత్ సిద్ధము. మఱియు, దీనివలన బ్రహ్మరుద్రులయందు శంకింపబడు పరత్వభావన నిరస్తమైనట్లే, వారి పత్నుల విషయములో ఉద్భావింపబడు ఆధిక్యశంకయు నిరస్తము.

( తాం శ్రియమ్ ) మొదటి పాదముద్వారా సిద్ధించిన కర్తరివ్యుత్పత్తివలన, రెండవ, మూడవ పాదములందు వివరింపబడిన కర్మణివ్యుత్పత్తివలన శ్రీశబ్దము పద్మావతీదేవికి వాచకమనుట తెలుపబడినది. అట్టి అప్రమేయవైభవమును, భగవానునకు శేషమై,



ఉభయవిభూతులకును శేషియైయుండు మహిమను పద్మావతీదేవి కల్గియుండుటను శ్లోకములోని "తామ్" అను సర్వనామపదము బోధించును.

(వేంకటేశమహిషీమ్ ఆశ్రయామః) "కృతాభిషేకా మహిషీ" అనునట్లు వేంకటేశ్వరుని పట్టపురాణి అగు పద్మావతీదేవిని మాకు పురుషకారిణిగా అగుటకొఱకు ఆశ్రయింతుము- అని భావము. ఆమె పురుషకారము లేని భగవదాశ్రయణము శూర్పణఖ చేసిన ఆశ్రయణమువలె ఫలింపదు. సరికదా, ముక్కు చెవులను పోగొట్టుకొనుటవంటి విపరీతఫలము నిచ్చునుకూడా! ఆమె పురుషకారమున్నచో "వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" అనునట్లు ఎంతటి తీవ్రమైన అపచారమునైనను స్వామి సహించి, కరుణించును.

2. యద్వైభవం నిరవధి స్వత ఆనుకూల్య -
వేషం న మాతు మల మాత్మవిదాదిదేవః ।
లోకేశ్వరీం మఖిలదీనజనే కృపాలుం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

ఏ పద్మావతీదేవియొక్క వైభవము అవధి లేనిదో, స్వతస్సిద్ధముగా అనుకూలమైన రూపమును కలదో, ఆత్మవిదుడైన ఆదిదేవుడగు స్వామికూడ దానిని తెలియలేనివాడో అట్టి మహిమను కల పద్మావతీదేవి అన్ని లోకములకు స్వామిని. సమస్తదీనజనులపట్ల కృపను చూపు స్వభావమును కల్గినది. వేంకటేశ్వరుని పట్టమహిషియగు ఆమెను (పురుషకారము కొరకు) ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకము శ్రీయామునుల చతుశ్శ్లోకిలోని "యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః" ఇత్యాది ద్వితీయశ్లోకమునకు అనువాదము.

(యద్వైభవం నిరవధి) భగవద్వైభవమువలె పద్మావతీదేవి వైభవమును అంతు లేనిది. భగవద్రామానుజులు వేదార్థసంగ్రహమున "అనవధికమహిమా మహిషీ" అని, గద్య ప్రారంభమున "భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూప గుణవిభవైశ్వర్య శీలాద్యనవధికాసంఖ్యేయకల్యాణగుణగణామ్" అనియు పల్కిరి.

ఇట్లు పద్మావతీదేవి వైభవము నిరవధియైనను, ఆశ్రితులకు ఆశ్రయించుటలో నిత్యము అనుకూలమై యుండును. అనుకూలమై ఉండుట అనగా - ఆనందజనకమై ఉండుటయే. భగవానుని వైభవమువలె పద్మావతీదేవి వైభవమును నిరవధియైనచో జగత్తులో శేషిద్వయము కలదా? అని శంకింప పనిలేదు. "అస్యేశానా జగతో విష్ణుపత్నీ"

అనునట్లు లోకమున కంతటికిని పద్మావతీదేవి ఈశాన అయినను భగవానునకు ఆమె శేషమే. కావున స్వామియొక్క సర్వశేషిత్వమునకు కొదువలేదు. రెండవ శేషి కలదను శంకకు చోటు లేదు. అట్లయినచో ఆమె వైభవము నిరవధి అనుట ఎట్లు? అనినచో, "అపూర్వనానారసభావనిర్భరప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధలీలయా" అని యామునులు, "భోగోపోద్ఘాతకేళీచుళకిత భగవద్వైశ్వర్యరూప్యానుభావా" అని భట్టరు, "పిత్తర్ పనిమలర్ పావైక్కు" అని దివ్యసూరులు వచించినట్లు సర్వజ్ఞుడగు భగవానుని సైతము మైమరపించి, భ్రమింపచేయు సౌందర్యలావణ్యలీలాదివైభవమును పద్మావతీదేవి కల్గినది. కావున నిరవధి అని పల్కుటలో ఎట్టి విప్రతిపత్తి లేదు.

(న మాతు మల మాత్మవిదాదిదేవః) "సో అంగ వేద యది వా న వేద" అని వేదము భగవానుని మహిమను అతడుకూడ తెలియలేడన్నది. అట్టి అప్రమేయవైభవమునే పద్మావతీదేవియు కల్గియున్నది. ఆ వైభవమును సర్వజ్ఞుడైన స్వామియు తెలియలేడు. అంతమాత్రముచే స్వామి సర్వజ్ఞత్వమునకు కొఱత లేదు. ఎందువలన అనగా - ఏది ఎట్లుండునో దానిని ఆ విధముగా తెలిసికొనుటయేకదా యథార్థజ్ఞానము. పద్మావతీదేవి మహిమ నిరవధికము. దానిని అట్లు గ్రహించుటయే తగును. కావున స్వామి సర్వజ్ఞత్వమునకు భంగము వాటిల్లదు. ఆకాశమున పద్మము కలదని, అది ఇట్టిదని భావించిన అది యథార్థజ్ఞానమగునా? కాదుకదా ! అట్లే సర్వేశ్వరుడైనను అమ్మవైభవము అంతు లేనిదని గ్రహించుటయే యుక్తము. ఈ ప్రయోగము. "దేవి! త్వమ్మహిమావధి న హరిణా నాపి త్వయా జ్ఞాయతే...." ఇత్యాది కూరేశులసూక్తిని తలపింపచేయుచున్నది. "శక్తత్వే సతి దయావత్త్వమ్ శరణ్యత్వమ్" అని శరణ్యలక్షణము. అనగా - రక్షింప శక్తి కలవాడు, రక్షింపవలెనను దయను కలవాడు ఎవ్వడో అతడే ఆశ్రయింపతగినవాడు. పద్మావతీదేవి లోకేశ్వరి అగుటచే పురుషకారమును చేయుటద్వారా రక్షించు సామర్థ్యమును, సంబంధమును కల్గినది. అట్లే, ఆమె దీనులపట్ల అంతు లేని దయను సహజముగానే కల్గినదగుటచే ఆమెయందు శరణ్యత్వపూర్తి కలదు. ఈ అంశము ప్రస్తుతప్రయోగమున ధ్వనించుచున్నది. అట్టి పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నామని తాత్పర్యము. ఒకవేళ స్వామి తన గొప్పతనమును తాను తెలిసికొన్నను, పద్మావతీ వైభవమును మాత్రము తెలియలేడను అర్థస్వారస్యము "ఆత్మవిత్" అనే పదముద్వారా ధ్వనించుచున్నది.

3. కారుణ్యపూరపరివాహకటాక్షవీచి-
సంధుక్షణేన పరిపాలితసర్వలోకామ్ ।
ఐశ్వర్యముఖ్యఫలదాయినిజస్వరూపాం



శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

కారుణ్యముతో నిండిన ప్రవాహములవంటి కటాక్షవీచికలతో తడపుటద్వారా సకలలోకములను పాలించునది, ఐశ్వర్యము మొదలగు సకలఫలములను ఇచ్చునట్టి స్వభావమును కల్గినది, లక్ష్మీస్వరూపిణి, శ్రీ వేంకటేశ్వరుని పట్టమహిషియగు పద్మావతీ దేవిని ఆశ్రయించుచున్నాము.

( కారుణ్యపూర . . . . . సర్వలోకామ్ ) ప్రస్తుత శ్లోకము యామునుల చతుః శ్లోకిలోని "ఈషత్త్వత్కరుణానిరీక్షణ సుధాసంధుక్షణాత్ రక్ష్యతే నష్టం ప్రాక్ తదలాభతః త్రిభువనం సంప్రత్యనంతోదయమ్, శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతా ప్రసాదాదృతే" ఇత్యాది మూడవ శ్లోకముయొక్క అర్థమును అనుసరించి రచింపబడినది.

"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని, "తేజ ఐక్షత" అని, "ఆప ఐక్షంత" అని మొదలుగాగల వైదికప్రమాణములవలన సంహారకాలమున లయమును పొందిన జగత్తును భగవానుడు తన సంకల్పరూపమైన ఈక్షణముద్వారా తిరిగి సృష్టించునని తెలియుచున్నది. అట్టి భగవన్నిరీక్షణముమాత్రమే కాక, లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీదేవియొక్క కరుణా కటాక్షవీక్షణముకూడ లోకముల సృష్టిస్థిత్యాదిక్రియలయందు హేతువనుట విశేషము. భగవానుని కటాక్షము సృష్టిస్థిత్యాదులకు సాక్షాత్ హేతువుకాగా, పద్మావతీదేవి కటాక్షము పరంపరయా హేతువు. అది ఎట్లనగా -- "యద్భ్రూభంగా ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః" అని, "శ్రియై సమస్తచిదచిద్విధాన వ్యసనం హరేః, అంగీకాంభిరాలోకైః సార్థయంత్యై" అని, "ఉల్లాసపల్లవితపాలిత సప్తలోకీ నిర్వాహకోరకితనేమకటాక్షలీలామ్" అని, "యస్యా వీక్ష్యం ముఖం తదింగిత పరాధీనో విధత్తే-ఖిలమ్" అని మొదలుగుగా గల అభియుక్తవచనములు భగవానుడు సృష్టిని లక్ష్మీదేవికటాక్షానుసారము చేయునని తెలుపుచున్నది. సంహారమువలె సృష్టియు అనుగ్రహకార్యమే. కావున ఇచట పరిపాలితశబ్దమునకు సృష్టి అను అర్థమునుకూడ గ్రహింపవచ్చును. నామరూపవిభాగా నర్హముగానున్న జగత్తును భగవానుడు లక్ష్మీదేవి కటాక్షానుసారము చిదచిద్విధానముచేసి, "నామరూపే వ్యాకరవాణి" అనునట్లు నామరూప విభాగార్హముగా చేయును. కావున లక్ష్మీదేవికిని సృష్టియందు పరంపరయా అన్వయము కలదని చెప్పనగును. జగత్కారణత్వ మున లక్ష్మీదేవికి అన్వయము కలదా? అని నడాదూర్ అమ్మాళ్ (శ్రీవాత్స్యవరదాచార్యుల వారు) అను ఆచార్యులు కురుకేశులనెడి ఆచార్యులను ప్రశ్నించగా "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చోత్పాదయితవ్యాః" అను ప్రమాణమునుబట్టి సహధర్మచారిణియగు లక్ష్మీదేవికి అన్వయము కలదని తెలియుచున్నదని వారు సమాధాన మిచ్చిరట. ఈ ఉదంతము శ్రీకృష్ణసూరియొక్క చతఃశ్లోకీ వ్యాఖ్యలో కలదు. "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" ఇత్యాది

శ్రుతి సృష్టికాలమున విద్యుద్వర్ణ అగు లక్ష్మీదేవిసాన్నిధ్యమును సూచించుచున్నవని అభిజ్ఞులు వివరించిరి. ఇట్టి అర్థ స్వారస్యమును సూచించు దివ్యసూరి సూక్తులను కలవు.

కారుణ్యమును నీటిప్రవాహముగా, కటాక్షములను కెరటములుగా నిరూపించుటచే నేత్రములు చల్లని నీటితో నిండిన నదులతో సమానములని స్ఫురించుచున్నది. కావున "త్వదీక్షణసుధాసింధువీచివిక్షేపశీకరైః, కారుణ్యామారుతానీతైః శీతలైః" ఇత్యాది దేవరాజాష్టకసూక్త్యర్థ మిచట పద్మావతీదేవి విషయమున అనుసంధింపబడినది. శ్లోకము లోని స్వరూపశబ్దమును స్వభావార్థకముగా గ్రహింపనగును.

దుర్వాసుని శాపమువలన నిఃశ్రీకమగునట్లు ముల్లోకములను పరిత్యజించిన లక్ష్మీదేవి క్షీరాబ్ధిని చేరెను. తత్ఫలితముగా త్రిభువనములు "అసన్నేవ" అనునట్లు నష్టప్రాయమయ్యెను. పిమ్మట -- "క్షీరోదాత్ శ్రీః సముత్పన్నా శ్రూయతేఽ మృతమంథనే" అని, "కొ(ళ్ళు)మ్ కడలిల్ అముదినిల్ పిఱన్ద అవళుమ్" అనునట్లు అమృతమునకు మించిన అమృతమై క్షీరాబ్ధినుండి అవతరించిన లక్ష్మీదేవి "దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" అను రీతిలో స్నాతయై, మహార్ఘమైన వస్త్రమును దాల్చి, చిత్రమాల్యానులేపనములను కల్గినదై ప్రకాశించుచు భగవానుని వక్షఃస్థలమున చేరెను. పిమ్మట ఆమె చల్లని చూపులవలన త్రిభువనములు సత్తను, సమృద్ధిని పొందినవి. "త్వయా దేవి! పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్ త్వయేదానీమ్ సమేధితమ్" అని విష్ణుపురాణమున ఇంద్రుడు స్వయముగా ఈ విషయమును తెల్పెను. ఇట్లు లక్ష్మీకటాక్షము లేనప్పుడు బ్రహ్మరుద్రాదులు తమ తమ ఐశ్వర్యమును కోల్పోవుట, ఆమె కరుణవలన తిరిగి పొందుట- అను అన్వయ- వ్యతిరేకములవలన త్రిభువనములు పరిరక్షణము లక్ష్మీకటాక్షాధీనమని ఏర్పడుచున్నది. లక్ష్మీఅష్టోత్తర స్తోత్రము నందు గల "నమామి కమలాం కాంతిం క్షమాం క్షీరోదసంభవామ్, అనుగ్రహపరా మృద్ధి మనఘాం హరివల్లభామ్" అను నామములు ఈ వృత్తాంతమునకు సూచకములు. మహాలక్ష్మీసంహితయందును -- "సామగ్ర్యజుర్మయీం దేవీం వేదగర్భాం మనస్వినీమ్, లోకైకేశవిభూతీనాం కారణం యన్నిరీక్షణమ్" అనుచు లక్ష్మీకటాక్షమే అందరి సంపదలకు మూలమని తెలుపబడినది.

( ఐశ్వర్యముఖ్యఫలదాయినిజస్వరూపామ్ ) లక్ష్మీస్వరూపిణియగు పద్మావతి సంపదకు చిహ్నము. కావున ముందుగా ఐశ్వర్యము ప్రస్తావింపబడినది. ముఖ్యశబ్దముచే కైవల్యము, ఉత్తమపురుషార్థమగు పరమపదప్రాప్తియు ఉపలక్షితములు. శ్రీయామునుల



సూక్తిలో "సంస్పృత్యక్షర వైష్ణవాధ్వసు" అని, పరాశరభట్టర్ సూక్తిలో "ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా" అని ఈ క్రమమే అనుసరింపబడుట గమనార్హము. ఇచటి ఐశ్వర్యశబ్దము భ్రష్టైశ్వర్యకాములగు ఆర్తులను, అపూర్వైశ్వర్యకాములగు అర్థార్థులను- ఇద్దరిని తెలుపును. కావున, ఇచట "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ" అనబడు నాల్గు రీతులలోని ప్రపన్నులను పద్మావతీదేవి అనుగ్రహించునని ఏర్పడుచున్నది. దివ్యసూరుల "తిరుమామమకళ్ తన్నరుళాల్ ఉలకిల్ తేర్మన్నరాయ్" అను సూక్తి లక్ష్మీకటాక్షము ఐశ్వర్యహేతువని తెలుపుచున్నది. "అరవిందలోచన మనఃకాంతా ప్రసాదాదృతే సంస్పృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్" అనే యామునసూక్తి పరమపద ప్రాప్తికి లక్ష్మీ కటాక్షం హేతువని తెలుపుతున్నది. పరాశరభట్టరు కూడ "ఆకుగ్రామనియామకాదపి విభో రాసర్వనిర్వాహకాత్" ఇత్యాది శ్లోకమున అల్పగ్రామాధికారి నుండి సర్వేశ్వరునివరకు గల అందరి ఐశ్వర్యము లక్ష్మీదేవి అధీనమనిరికదా !

"అమృతస్యైష సేతుః" అని, "ఫలమత ఉపపత్తేః" అనియు ఇత్యాదిగా భగవానుడే మోక్ష ప్రదాతగా తెలుపబడుచుండగా లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీదేవి మోక్షప్రదాయిని అనుట ఏమి? అను శంక కలుగవచ్చును. ఇచట తెలుపబడిన పద్మావతీదేవియొక్క మోక్షప్రదాతృత్వము పురుషకారాత్మకమని చెప్పనగును. "ఉపాయోపేయత్వే తదిహ తవ తత్త్వమ్" అనునట్లు స్వామి ఉపాయత్వము స్వతస్సిద్ధమే అయినను తదాశ్రయణము లక్ష్మీపురుషకారములేనిదే ఫలింపదు. కావున ఇట్లు తెలుపబడినది. "లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" అను ప్రమాణము నందు తెలుపబడిన లక్ష్మీవిషయకమైన రక్షకత్వము (ఈ ప్రమాణములోని) తృతీయావిభక్తి ప్రయోగముచే అప్రధానమైనది, పురుషకారాత్మకమైనదని తెలియుచున్నదని అభిజ్ఞులవ్యాఖ్య. అంతియేకాక, లోకమున దానమిచ్చుటలో సహాయపడినవారిపట్లగల కృతజ్ఞతాభావముతో వారినికూడ దాతలుగా పేర్కొనుటయు అనుభవసిద్ధము. కావున లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీదేవి మోక్షప్రదాయిని అనుటలో అనుపపత్తి లేదని చెప్పనగును.

4. యద్రూప మద్భుతకరం పరసంజ్ఞ మాద్యం
వ్యూహాత్మకం చ విభవాఖ్యవపూంషి చైవ।
అన్యచ్చ రూప మఖిలం యదుపాశ్రయంతీం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

భగవానుని మొట్టమొదటిది, ఆశ్చర్యకరమైనది అగు పరరూపమును, వ్యూహమును

వేఱొక రూపమును, విభవములనబడు అవతారమూర్తులను, అట్లే అంతర్యామి, అర్చారూపమునలను మిగిలిన రూపములను ఆశ్రయించి, ఎల్లప్పుడు కలిసియుండునది, లక్ష్మీస్వరూపిణియగు వేంకటేశ్వరుని పట్టమహిషి పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకము చతుఃశ్లోకిలోని "మూర్తం బ్రహ్మ తతో-పి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతం, యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి తాన్యాహుః స్వైరనురూపరూపవిభవైః" అను సూక్తిని అనుసరించి, రచింపబడినది. ఇచటకూడ "శ్రీయతే ఇతి శ్రీః" అను శ్రీశబ్ద వ్యుత్పత్తి వివరింపబడుట గమనార్హము.

(యద్రూపమద్భుతకరం .... ఉపాశ్రయంతీమ్) "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని, "ఆనందో బ్రహ్మ" అని కీర్తింపబడు భగవానుని స్వరూపముకంటె మిక్కిలి కమనీయమైనది, ఆ స్వామినే మైమరపించునది యగు భగవానుని దివ్యమంగళ విగ్రహము అయిదు విధములుగా నుండుని శాస్త్రములు తెలుపుచున్నవి. "మమ ప్రకారాః పంచేతి ప్రాహు ర్వేదాంతపారగాః, పరో వ్యూహశ్చ విభవో నియంతా సర్వదేహినామ్, అర్చావతారశ్చ తథా దయాళుః పురుషాకృతిః, ఇత్యేవం పంచథా ప్రాహుర్మాం వేదాంతవిదో జనాః" అనుచు భగవానుడే స్వయముగా (విష్వక్సేన సంహితలో) ఈ విషయమును తెలిపెను.

ఈ విషయమును ఉభయవేదములనబడు సంస్కృతవేదము, ద్రావిడవేదమును వెల్లడించు చున్నవి. "అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్" అని "నీర్పూ నిలప్పూ మరత్తిలొణ్ పూ" అనియు కల సంస్కృతద్రావిడ వేదసూక్తులు వరుసగా వ్యూహ - విభవ-పరరూపములను తెలిపినవి. "అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి", "ఒరువనడియేనుళ్లానే" అను సూక్తులు అంతర్యామి రూపమును, "పూర్ణమదః పూర్ణం పూర్ణాత్ పూర్ణముదచ్యతే", "తమరుకన్దదెవ్వురువుమ్ అవ్వురువమ్ తానే" అను ప్రమాణములు అర్చారూపమును తెలుపుచున్నవి. వీనిలో పరరూపము పరమ పదములోనుండు రూపము. వ్యూహము క్షీరాబ్ధిలోని రూపము. విభవరూపములు అవతారదశలు. అంతర్యామి జీవుల హృదయాంతరాళములలోని రూపము. అర్చామూర్తి దేవాలయ, గృహాలయాదులలోని శిలాకాష్ఠమయమైన రూపము. ఇవి అన్నియు భగవానుని దివ్యరూపములు. అత్యద్భుతకరములు. శుభాశ్రయములు. ఈ రూపములన్నిటియందు లక్ష్మీదేవి, "విష్ణోః శ్రీరనపాయినీ', "అకలకిల్లేన్ ఇఱైయు మెన్లు" అని ఎల్లప్పుడు కలసి యుండును.

5. వాత్సల్యశీలసులభత్వదయాక్షమాద్యైః
కల్యాణనిర్మలగుణైః శ్రితరక్షణాద్యైః ।



సర్వస్య జంతునివహస్య శరణ్యభూతాం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

వాత్సల్యము, శీలము, సౌలభ్యము, దయ, క్షమ మొదలగు కల్యాణ గుణములతో, ఆశ్రితరక్షణాది వ్యాపారములచే చేతనులందరికిని ఆశ్రయింపతగినదై యున్నది, లక్ష్మీస్వరూపిణియగు శ్రీ వేంకటేశ్వరుని పట్టమహిషి పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

భగవానునివలె పద్మావతీదేవియు సకలకల్యాణగుణములను కల్గినది. అయినను కొన్ని గుణములలో ఆమెకు ప్రత్యేకత కలదు. భట్టరు శ్రీగుణరత్నకోశమున -- "యువత్వాదౌ తుల్యే-ప్యపరవశతా శత్రుశమవస్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్త్వసులభాన్, త్వయి స్త్రీత్వైకాంతాన్ మ్రదిమపతిపారార్థ్యకరుణా క్షమాదీన్ వా భోక్తుమ్ భవతి యువయోరాత్మని భిదా" అనుచు యువత్వాదిగుణములు దివ్యదంపతులకు సమానములే అయినను, స్వామియందు పురుషత్వప్రయుక్తములైన స్వాతంత్ర్యశత్రు శమనాదులు విశిష్టగుణములు; అట్లే, దేవియందు క్షమ, దయాది గుణములు విలక్షణములు - అని పల్కుట ప్రస్తుతమున అనుసంధేయము. భట్టరు శ్లోకమున ప్రస్తావింపబడిన పతివ్రతాత్వగుణమిచట సందర్భమునుబట్టి ఆవశ్యకము కాకుండుటచే కవి పేర్కొనక మిగిలినవానిని గ్రహించెనని చెప్పనగును. అంతియేకాక, భట్టరువారి శ్లోకమున శబ్దతః తెలుపబడని వాత్సల్య, సౌశీల్య, సౌలభ్యములును ప్రస్తావింపబడుట ఇచటి విశేషము. భగవానునియందును ఈ గుణములన్నియు పుష్కలముగానే ఉన్నను, ఒకచో అవి నిరంకుశస్వాతంత్ర్యమువలన మఱుగుపడి ప్రకాశింపకపోవచ్చును. లక్ష్మీప్రతిరూప అగు పద్మావతీదేవియందు అట్లుకాదని తాత్పర్యము. ఇట్టి గుణములతో ఆశ్రితరక్షణాదివ్యాపారములును భక్తుల మనస్సుకు విశ్వాసమును, ధైర్యమును కల్గించును. కావున పద్మావతీదేవి వారు ఎట్టి పాపమును చేసినవారైనను, వారు తమ తప్పును తెలిసికొని పశ్చాత్తాపపడినచో, వారికి ఆశ్రయింపతగినదై యున్నది. భగవద్రామానుజులును గద్యత్రయప్రారంభమున లక్ష్మీప్రపదనము చేయుచు, "ఐశ్వర్యశీలాద్యనవధికకల్యాణ గుణగణామ్" అని పల్కిరికదా ! ఇచటి ఆదిశబ్దముచే వాత్సల్యక్షమాదులు ఉపలక్షింపబడినవని వ్యాఖ్యాతలు వివరించిరి. అట్టి గుణములే ఇచట ప్రస్తుతింపబడినవి. శ్లోకమునందు ప్రస్తావింపబడిన గుణముల స్వరూపము సంగ్రహముగా తెలుపబడుచున్నది.

వాత్సల్యము

ఈ గుణము ధేనువు తనకు అపుడే పుట్టిన బిడ్డపట్ల ప్రకటించు గుణము.

ఆశ్రితులను దగ్గరకు చేర్చుకొనుటలో, వారిని రక్షించుటలో స్వామికి ఉపయోగపడు గుణములలో ఇది ప్రథమగణ్యము. కావుననే ముందుగా ప్రస్తావింపబడినది. శరణాగతిగద్యలో శ్రీరామానుజులును ఈ గుణమును అసకృత్ ప్రస్తావించిరి. వాత్సల్యమనగా దోషమును చూడకుండుట అనియేకాక, దానిని గుణముగా స్వీకరించుటయు- అని ఆచార్యుల సిద్ధాంతము. ఈ విధముగానేకదా ధేనువు లేగదూడపట్ల ప్రవర్తించును. తన నాలుకతో లేగదూడ ఒంటికి అంటుకొనియున్న మలినములను అసహ్యించుకొనక, పరమభోగ్యముగా తలచి ఆస్వాదించి, తొలగించును. శ్రీనివాస భగవానునియందు ఈ గుణము విశిష్టగుణమని "నికరిల్ పుకాయ్" అని "ఎన్‌కణ్ పాశమ్ వైత్తె" అని పల్కుటద్వారా శఠకోపసూరి సూచించిరి. కాని, ఆ స్వామి వాత్సల్యముకన్న పద్మావతీదేవి వాత్సల్యమే మిన్న. ఈమె జగన్మాత కదా! ఈమెవలనకదా స్వామి వాత్సల్యము ఉద్బుద్ధమగును.

శీలము

గొప్పవ్యక్తి తక్కువవారితో ఎట్టి భేదము లేక కలిసియుండుటకు శీలగుణమని పేరు. ఇట్లు కలియునపుడు తాను గొప్ప అను భావము లేశమైనను హృదయమున నుండరాదు. అపుడే శీలగుణమునకు పూర్ణత కల్గును. లేక, ఆశ్రితులకు తన ఈశ్వరత్వముచే ఎట్టి భయము కలుగకుండునట్లు ప్రవర్తించుట- అనియు చెప్పవచ్చును.

సౌలభ్యము

"న సందృశే తిష్ఠతి రూప మస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" అని తెలుపబడినట్లు బ్రహ్మరుద్రేంద్రాదులను సైతము దర్శింప సాధ్యము కాని తన దివ్యమంగళరూపమును సామాన్యులుకూడ దర్శింప వీలగునట్లు చేయుట. ఇట్టి సౌలభ్యపరాకాష్ఠను అర్చారూపము లోనే దర్శింపనగునని ఆచార్యుల అభిప్రాయము. ఈ గుణమును పద్మావతీదేవి అర్చామూర్తివిషయమున అన్వయించి పల్కుట విశేషము కదా!

దయ

దయ అనగా స్వార్థచింతన లేని, ఇతరుల దుఃఖములను చూచి సహింపలేని గుణము. "దయా పరవ్యసనహరా", "దయా-న్యేషాం దుఃఖా-ప్రసహనమ్" ఇత్యాది సూక్తులు ఇచట స్మరణీయములు. "కృపయా పర్యపాలయత్" అనునట్లు దయాస్వరూపిణి యగు పద్మావతీదేవియొక్క దయాగుణవైభవము విశిష్టమైనదికదా!

క్షమ



ఎట్టి అపరాధమునైనను సహించి, మన్నించు గుణము. క్షమ. "సా న స్వాంద్ర మహాగసస్సుఖయతు క్షాంతి స్తవాస్మికీ" అనుచు తనను పలువిధముల బాధించిన రాక్షసస్త్రీలను సైతము క్షమించి, వారిని హనుమానుని బారినుండి కాపాడిన సీతాదేవి క్షమ విభీషణుని, కాకాసురుని - ఇట్లు ఒకరిద్దరిని మాత్రము మన్నించిన రామచంద్ర భగవానుని క్షమకంటే గొప్పది అనిరి. స్వామి క్షమకంటే అమ్మ క్షమాగుణము గొప్పది అనుటకు ఇంతకంటే ఏమి ప్రమాణము కావలయును?

ఇట్టి గుణములతోపాటు ఆశ్రితరక్షణాదులును భక్తులకు పద్మావతీదేవిని ఆశ్రయించుటలో విశ్వాసమును కల్గించుచున్నవి. అట్టి లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీ దేవిని పురుషకారమునకై ఆశ్రయించుచున్నామని తాత్పర్యము.

6. బ్రహ్మాదిదేవవనితాజనసర్వకాల-
సంసేవ్యమాన నిజపాదసరోజయుగ్మామ్ ।
దేవీం సమస్తజనమాతర మప్రమేయాం
శ్రీ వేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

బ్రహ్మాదిదేవతల పత్నులగు సరస్వత్యాదులు ఎల్లప్పుడు సేవించునట్టి పద్మములవంటి పాదముల జంటను కల్గినది, సమస్తజనులకు తల్లి, ఎవరు తెలియలేని మహిమను కల్గినది, లక్ష్మీస్వరూపిణియు, అగు శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

"దాసీభూతసమస్తదేవవనితామ్" అను లక్ష్మీ అష్టోత్తరశతనామస్తోత్రసూక్తి భావమిచట స్మరణీయము. శ్రీయామునుల చతుఃశ్లోకిలోని "బ్రహ్మేశాది సురవ్రజస్సదయితః త్వద్దాసదాసీగుణః" అను సూక్తి ఇచట వివరింపబడినదనదగును. మొదటి శ్లోకమునందే "యత్కింకరాః విధిశివప్రముఖాః సురాః" అనియున్నను వారి పత్నులును పద్మావతికి సేవ చేయుదురనుట ఇచట శబ్దతః ప్రతిపాదింపబడినది.

6. యద్భ్రూవిలాస మనుసృత్య చరాచరాణి
న్యూనాధికాని భగవానపి నిర్మిమీతే ।
తాం సర్వలోకపరిరక్షణబద్ధదీక్షాం
శ్రీవేంకటేశమహిషీ శ్రియ మాశ్రయామః ॥

ఎవరి కనుబొమల కదలికలను అనుసరించి భగవానుడు హెచ్చు తగ్గులుగా నున్న ఈ చరాచరజగత్తును నిర్మించునో, అట్టి, అన్ని లోకములను రక్షించుటలో దీక్షను కల, లక్ష్మీస్వరూపిణియగు శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి పద్మావతీదేవిని

ఆశ్రయించుచున్నాము.

ఈ స్తోత్రము కూరేశుల "యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తే-ఖిలమ్" అను సూక్తిని, భట్టర్ కృతమగు "యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః" అను సూక్తిని అనుసరించుచున్నది. అట్లే, శ్రీరంగరాజస్తవములోని "నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః, ఈశేశితవ్యవైషమ్యనిమ్నోన్నత మిదం జగత్" అను శ్లోకములోని భావమును కవి పద్మావతీదేవి విషయమున అనుసంధించిరి అనదగును.

లోకములో దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాదిరూపమున సృష్టి పలు విధములుగా, హెచ్చుతగ్గులుగా నున్నది. ఇట్టి సృష్టిని స్వామి దేనిని అనుసరించి చేయుచున్నాడనగా, పద్మావతీదేవి తన కనుబొమ్మల విలాసములలోని తారతమ్యములనుబట్టి. అట్లు చేయు చున్నాడు. అనగా - ఎవరిని ఉన్నతునిగా సృజింపుమని పద్మావతీదేవి తన కనుబొమ్మలతో సూచించునో వానిని ఉన్నతునిగా సృష్టించుచున్నాడు. ఎవనిని తక్కువవానినిగా సృజింపుమనునో వానిని అట్లే సృష్టించునని తాత్పర్యము. పద్మావతీదేవి ఇట్లు సూచించుట ఆమె దయలేనితనమునకు, పక్షపాతమునకు సూచకముకదా! అన్నచో, ఆమె ఆయా జీవుల కర్మానుసారము భ్రూభంగములను చేయును, కావున అట్టి దోషములకు అవకాశము లేదు. "వైషమ్యనైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్" జ్ఞానశక్త్యాది గుణములను కల స్వామికి పద్మావతీదేవి భ్రూభంగములు కావలెనా? అనినచో, పరమరసికుడైన స్వామి తానే స్వయముగా జీవుల కర్మలను చూచి, సృష్టి చేసినచో పద్మావతీదేవి భ్రూభంగముల సొబగును చూచు అదృష్టమునకు నోచుకొనడు కదా ! అంతియేకాక, గృహస్థ ధర్మమగు సృష్టికార్యమున అమ్మకు అన్వయము లేకుండపోవును. లక్ష్మీస్వరూపిణియగు పద్మావతీదేవి ఇట్లు పాల్గొనక పోయినచో స్వామి ఏకాకి యగును. లీలారసమును అనుభవింపలేడు. కావుననే కూరేశులు "క్రీడేయం ఖలు నాన్యథా-స్య రసదా స్యాత్" అని పల్కిరి. మఱియు పద్మావతీదేవి భగవానుని ఎన్నడును విడువక, ఎల్లప్పుడు వెంటనుండుటచే ఆమె సౌందర్యలీలావిలాసాదులకు పరవశుడై ఆమె గీచిన గీటు దాటలేని విధముననుండు స్వామిని ఆ యా విధముగా సృష్టింపుమని పురికొల్పుననియు చెప్పవచ్చును.

ఈ విధముగా సృష్టియందు భగవానుని తన భ్రూభంగములతో నియమించు పద్మావతి అట్లు సృష్టింపబడిన జగత్తునంతటిని రక్షించుటలో అచంచలమైన దీక్షను కల్గినది.

7. నిష్కృష్టసత్త్వగుణకం పరమం పదం యద్



భోగాయ హి త్రిగుణకా తు విభూతి రేషా ।
యస్యా విహారసదనం పరికల్పితం తాం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

కేవలము సత్త్వగుణమునుమాత్రమే కల్గిన పరమపదము ఎవరి భోగముకొఱకై యున్నదో, త్రిగుణాత్మకమైన ఈ లీలావిభూతి ఎవరి విహారసదనముగా సృష్టింపబడినదో, అట్టి శ్రీవేంకటేశ్వరునికి పట్టమహిషి, లక్ష్మీస్వరూపిణియు అగు పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకము భట్టరుప్రణీతమైన శ్రీగుణరత్నకోశములోని "కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్య మాలింగతోః . . . . . అండానావరణైః సహస్రమకరోత్ తాన్ భూర్భువ స్సర్వతః శ్రీరంగేశ్వరదేవి! తే విహృతయే సంకల్పమానః ప్రియః" అని, "యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతం....... తద్విష్ణోః పరమం పదం తవ కృతే మాతః! సమామ్నాసిషుః" అను శ్లోకములను అనుసరించుచు రచింపబడినది. వీనిలో మొదటి శ్లోకమున లీలావిభూతి, రెండవ శ్లోకమున నిత్యవిభూతియు లక్ష్మీదేవికొఱకే భగవానుడు ఏర్పరచెనని తెలుపబడుట గమనింపతగినది.

(నిష్కృష్టసత్త్వగుణకం పరమం పదమ్) పరమపదము కేవలము సత్త్వ గుణాత్మకము. "క్షయంతమస్య రజసః పరాకే" అని, "తమసః పరస్తాత్" అని, "పంచశక్తి మయే దివ్యే శుద్ధసత్త్వే సుఖాకరే" అనియు గల పలు సూక్తులు ఈ విషయమును తెలుపు చున్నవి. దీనికే శుద్ధసత్త్వమని పేరు. ఇది త్రివిధములైన అచిత్తులలో ఒకటి "యత్పురాణ మాకాశం సర్వస్మాత్ పరమం ధ్రువమ్, తత్పదం ప్రాప్య" ఇత్యాది ప్రమాణములు పరమం పదమను పేరుతో శుద్ధసత్త్వమను అచిత్తు పిలువబడుటను తెలుపుచున్నవి. ఇది నిత్యము, జ్ఞానానందజనకము, కేవలము భగవానుని సంకల్పముచే విమానగోపురమండపాది రూపమున పరిణమించునది, భగవానునకును ఇంతటిదని తెలిసికొనరానిది, అత్యద్భుతమైనదియును. ఇది అంతయు లక్ష్మీ స్వరూపిణియగు పద్మావతీదేవి ఆనందము కొరకే.

(త్రిగుణకా తు విభూతి రేషా యస్యా విహారసదనమ్) లీలావిభూతి సత్త్వరజస్తమస్సు లను మూడు గుణములతో కూడినది. "అజా మేకాం లోహితశుక్లకృష్ణామ్, బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్" అని వేదము ఈవిషయమును తెల్పినది. "త్రిగుణం తత్ జగద్యోనిరనాదిప్రభవాప్యయమ్", "సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః" ఇత్యాది సూక్తులును ఇచట స్మరణీయములు. దీనిని శ్రీపిళ్లై లోకాచార్యులవారు వర్ణించుచు- "నిత్యమాయ్, ఈశ్వరనుక్కు క్రీడాపరికరమాయ్" అని తెల్పిరి. స్వామికి లీలాపరికరమైనచో తత్పృత్తియగు

పద్మావతికిని లీలోపకరణమే అగును కదా!

ఇట్లు ఉభయవిభూతులను పద్మావతీదేవి ఆనందముకొరకే స్వామి ఏర్పరచెనని స్పష్టపడుచున్నది.

8. ఆర్ద్రాపరాధశతనిర్భరరాక్షసీనాం
దత్వా-భయం హనుమతః పరిరక్షయంత్యా ।
లఘ్వీ యయా హి కృపయా-జని రామగోష్ఠీ
శ్రీవేంకటేశ మహిషీం శ్రియ మాశ్రయామః ॥

అత్యంతనూతనములైన వందలాది అపరాధములను తనపట్ల నిండుగా చేసిన లంకలోని రాక్షసస్త్రీలను హనుమంతుని బారినుండి సీతాదేవి పరమకృపతో రక్షించుటచే శ్రీరాముని గోష్ఠి తక్కువగా చేయబడినది. అట్టి సీతాదేవి మాఋ రూపము, శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషియగు పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకమునకు పరాశరభట్టరు రచించిన శ్రీగుణరత్నకోశములోని "మాతః మైథిలి! రాక్షసీస్త్వయి తదైవార్ద్రాపరాధాస్త్వయా రక్షంత్యా పవనాత్మజాత్ లఘుతరా రామస్య గోష్ఠీకృతా, కాకం తం చ విభీషణం శరణమిత్యుక్తి క్షమౌ రక్షతః" అను శ్లోకరత్నము మూలము. అందలి భావమేకాక శబ్దములును యథాతథముగ అనువదింపబడుట గమనింపతగినది. ఇందు పద్మావతీదేవియొక్క క్షమాపరాకాష్ఠ శ్రీరామాయణవృత్తాంత మూలమని వర్ణింపబడుచున్నది. సీతాదేవియు లక్ష్మీస్వరూపిణియగుటచే, ఆమె క్షమాగుణములను వర్ణించుటవలన తదాత్మకయగు పద్మావతీదేవి క్షమను వర్ణించినట్లే యగును. ఇట్టి వివరణమును తరువాతి శ్లోకమునను గ్రహింపతగును.

సీతాదేవిని లంకలో అశోకవనమున బంధించియుంచిన రావణుడు ఆమెను భయపెట్టి, బాధించియైనను తన వశమునకు వచ్చునట్లు చేయుడని కొంతమంది రాక్షస స్త్రీలను నియమించెను. వారును సీతాదేవిని పలువిధములుగా బాధించుచుండిరి. హనుమానుడు లంకలో ప్రవేశించినపుడు ఈ విషయమును ప్రత్యక్షముగా చూచెను. రావణవధానంతరము రాముని ఆజ్ఞపై ఆ శుభవార్తను సీతాదేవికి హనుమానుడు తెలుపవచ్చినప్పుడుకూడ వారు సీతాదేవిని బాధించుచునే యుండిరి. శ్లోకములోని 'ఆర్ద్ర' శబ్దప్రయోగము తత్ క్షణములోకూడా రాక్షసస్త్రీలు సీతాదేవిని బాధించుటను సూచించును. అంతవరకును ఎట్లో సహించిన హనుమంతుడు ఇక సహింపలేక, సీతాదేవివద్దకు వచ్చి "అమ్మా! నీవు సరే అనుము. నిన్ను ఇన్ని విధములుగా ఇంతకాలము పీడించిన వీరికి తగిన శాస్తిని చేసెదను" అని పల్కెను. అపుడు జగన్మాతయగు సీతాదేవి అతనిని



మందలించుచు, "కార్యం కరుణ మార్యేణ, న కశ్చిత్ నాపరాధ్యతి"- ఓయీ! నీవు ఆర్యుడవు "వీరిపై దయ చూపుము. ఈ లోకమున తప్పుచేయనివారెవ్వరు ఉన్నారు?" అని అతనిని సమాధానపరచెను. ఇట్లు చివరి క్షణమువరకు తనను బాధించుటయే కాక, ఇసుమంతయు పశ్చాత్తాపమును పొందక, తనను శరణు వేడని రాక్షసస్త్రీలను ఎంతమందినో క్షమించిన సీతాదేవి క్షమ, కాకాసురుడు, విభీషణుడు అను ఇద్దరిని, ముగ్గురిని మాత్రము క్షమించిన శ్రీరాముని క్షమకంటె గొప్పదికదా! - అని తాత్పర్యము. సీతాదేవి క్షమ శ్రీరాముని క్షమవలె గొప్పది అని పలుకక, రాముని గోష్ఠి సీతాదేవి గోష్ఠిచే చిన్నదిగా చేయబడినదనుట ఒక ఉక్తి చమత్కారము. సీతాదేవి పలువురు రాక్షసస్త్రీలను రక్షింపగా, శ్రీరాముడు మాత్రము కాకాసురుడు, విభీషణుడను ఇద్దరు ముగ్గురను మాత్రమేకదా రక్షించెను. కావున సంఖ్యాదృష్టిలోకూడ రాముని గోష్ఠి చిన్నదియే- అను స్వారస్యమును ఇచటి "రామగోష్ఠీ యయా లఘ్వీ అజని" అను ప్రయోగమువలన ధ్వనించుచున్నది.

"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః" అని కాకము, "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ తమేవ శరణం గతః" అని విభీషణుడును శ్రీరాముని శరణు వేడినట్లు వారిని స్వామి కాపాడినట్లు రామాయణమున కలదు. ఇట్లు శరణమని పలుకక, రావణ వధానంతరమును హింసించు రాక్షసస్త్రీలను క్షమించిన సీతాదేవి క్షమాగుణము స్వామి క్షమకంటె గొప్పదేకదా ! అంతియేకాక, పురుషుడైన స్వామి క్షమలో కించిత్తు కాఠిన్యము ఉండిన ఉండవచ్చును. కాని, సహజముగా స్త్రీయు, అంతకు మించి జగన్మాతయు అగు పద్మావతీదేవి క్షమ అంతకంటె గొప్పదిగా నుండుట తగినదే. ఔపచారికమాతృత్వముకంటె స్వాభావికమైన మాతృత్వము ఉత్కృష్టము కదా!

9. పూర్ణాగసి శ్రయణ ఉన్ముఖ చేతనే-స్మిన్
ఈశే-పి కోపకలుషే కిమిదం? విదోషః ।
కోవేత్యుదారవచనైః పరిరక్షయంతీం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

సంపూర్ణముగా పాపములను చేసిన ఈ చేతనుడు (జీవుడు) ఆశ్రయణమునకు సుముఖుడైనపుడు, భగవానుడు పూర్వము ఈ జీవుడు చేసిన పాపములకు కోపించినవాడై మనస్సున కోపము వలన కాలుష్యమును పొందగా, వాత్సల్యరూపిణియగు పద్మావతీదేవి- "స్వామీ! ఇది ఏమి? దోషము లేనివాడెవ్వడు?" అను గొప్పవైన అనునయవచనములను పల్కి, స్వామి కోపమును ఉపశమింపజేసి, జీవుని రక్షించును. అట్టి, లక్ష్మీస్వరూపిణియగు శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ఈ శ్లోకమునందు పద్మావతీదేవియొక్క పురుషకారవైభవము ప్రస్తుతింపబడినది. శ్రీపరాశరభట్టారకుల "పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః, కిమేతత్? నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః ఉపాయైర్విస్మార్య స్వజనయసి" అను శ్రీగుణరత్నకోశశ్లోకము దీనికి మూలము.

శ్రీమన్నారాయణత్వప్రయుక్తమైన స్వాభావికసంబంధము భగవానునకు సకల చేతనులతో ఉండగా స్వామిని ఆశ్రయించునపుడు పద్మావతీదేవియొక్క పురుషకారావశ్యకత ఏమి? అను ప్రశ్నకు ప్రస్తుతశ్లోకము తగిన సమాధానము. సకలజగత్తును స్వామి "భూతానా మవ్యయః పితా" అనునట్లు తండ్రి కాగా, పద్మావతీదేవి జగన్మాత. లోకమున తండ్రి హితపరుడుగా, తల్లి ప్రియపరురాలుగా నుండుట సహజము. తల్లి తన సంతానము కష్టపడుటను చూచి సహింపలేదు. భగవానుడు సర్వభూతసుహృత్తే అయినను, జీవుడు జేయు నిరంతరములైన, ఘోరములైన అపచారములకు కోపించి, "క్షిపామి" అని, "న క్షమామి" అని శిక్షింపనెంచును. స్వామి ఇట్లు తలచుట హితత్వప్రయుక్తమగుటచే దోషము కాదు. అపుడు స్వామి కోపమును ఉపశమింపచేయుటకు పద్మావతీదేవియొక్క పురుషకారము అవశ్యము అపేక్షితము.

భగవానుడు చేతనునిపై కోపించినపుడు పద్మావతీదేవి స్వామిని చూచి "ఈ కోపమునకు ఏమి కారణము" అని ప్రశ్నించును. అపుడు స్వామి "ఇట్లు నన్ను అడిగి తెలిసికొనవలయునా? ఇంతకాలముగా ఇతడు చేసిన అపరాధములను నీవు ఎరుగవా? ఏమి?" అని బదులు పల్కును. అపుడు దేవి సైకతాన్నమునందు (ఇసుకతో చేసిన అన్నములో) రాళ్ళను ఏరువారుందురా? ఇతని అపరాధములను చూచి, మీరిట్లు కోపించి, శిక్షింపనెంచినచో ఇతనికి వేఱు గతి కలదా? ఇతనికి మీకును మధ్య గల సంబంధ విశేషమును చూచినను అవి విడువ వీలుకానిది కదా! మీ సొత్తు అయిన ఇతనిని పొందుట మీకు లాభము కదా! "ఎదిర్ శూల్ పుక్కు" అనునట్లు పలు విధముల జీవులను రక్షింప ప్రయత్నించు మీకు నేను చెప్పవలయునా? రక్షణమును అపేక్షించి వచ్చిన ఇతనిని రక్షింపకున్నచో మీ సర్వరక్షకత్వము నిలచునా?" అని పల్కును. అందులకు స్వామి "అనాదికాలముగా నా ఆజ్ఞను అతిక్రమించి, నా కోపమునకు గురి అయిన ఇతని తప్పులకు తగినట్లు దండింపక అతనిని క్షమించి, రక్షించినచో శాస్త్రమర్యాద- అనగా తప్పుచేసినవానిని శిక్షించెదనను క్రమము భగ్నమగును కదా! " అని బదులు పల్కును. అపుడు పద్మావతీదేవి "ఇతనిని క్షమించి, రక్షింపక, అపరాధములకు తగ్గినట్లు శిక్షించినచో మీ కరుణ మొదలగు గుణములు జీవించునా? ఇతనిని క్షమించిననే అవి నిలచును కదా" అనును. ఈ మాటలను వినిన స్వామి



"ఇతనిని దండింపక విడచిన శాస్త్రమర్యాద నశించును. దండించినచో కరుణాదిగుణములు నిలువవు. ఇపుడు ఏమి చేయగలము?" అని తడబాటు పడును. అపుడు పద్మావతీదేవి "స్వామీ! శాస్త్రమర్యాద చెడకుండ, మీ కరుణాదిగుణములు వ్యర్థములు కాకుండనుండునట్టి ఉపాయమును తెలిపెదను, వినుడు. అంతులేని పాపములను చేయుచు, మిమ్ము ఆశ్రయింపనివానిని దండింపుడు. పశ్చాత్తాపమును పొంది, నీపట్ల అభిముఖ్యమును చూపువారి విషయమున మీ కరుణాది గుణములను ప్రదర్శింపుడు. ఇట్లయిన ఉభయతారకముగా నుండును." అని ఉపాయమును పల్కును. అపుడు స్వామి ఆమె మాటలను అంగీకరించి ఆశ్రయణోన్ముఖుడైన చేతనుని రక్షించును. ఇది అంతయు పద్మావతీదేవియొక్క ఉపదేశప్రభావమే కదా!

ఒకచో, నిరంకుశస్వతంత్రుడగు భగవానుడు ఆ మాటలనుకూడ లక్ష్యపెట్టక "ఇట్లు పల్కుట నీకు అలవాటే కదా!" అని పలుకవచ్చును. అపుడు దివ్యసూరులు పల్కిన రీతిలో స్వామిని పద్మావతీదేవి "పిత్తర్ పనిమలర్ పావైక్కు" అనునట్లు తన సౌందర్యలావణ్యాదు లతో, భ్రూనేత్రవిక్షేపాదులతో మైమరపించి, తన వశము చేసికొని, తన మాటను జవదాటకుండ చేయును. ఈ అంశమును శ్రీపిళ్ళైలోకాచార్యులవారు "ఉపదేశత్తాలే మీళాదపోదు చేతననై అరుళాలే తిరుత్తుమ్, ఈశ్వరనై అకాలే తిరుత్తుమ్" అని శ్రీవచన భూషణమను గ్రంథమున పల్కిరి. ప్రస్తుతశ్లోకమున తన సౌందర్యాదులతో వశీకరించు కొనుననుట శబ్దతః ప్రస్తుతింపబడకున్నను అర్థస్వారస్యమునుబట్టి అన్వయించుటలో విప్రతిపత్తి లేదు కదా!

10. వానాచలాఖ్యయతివర్య మవేక్ష్య దోషైః
జుష్టం గుణై ర్విరహితం పరమాణుమాత్రైః ।
మాం చాతివత్సలతయా భృశ మాద్రియంతీం
శ్రీవేంకటేశమహిషీం శ్రియ మాశ్రయామః ॥

వానాచలయతీశ్వరులను చూచి, సకలదోషములను కల్గినవాడను, పరమాణు మాత్రములైన సద్గుణములను అయినను లేనివాడను అగు నన్ను గొప్ప వాత్సల్యముతో ఆదరించునది, లక్ష్మీస్వరూపిణి, శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషియు నగు పద్మావతీదేవిని ఆశ్రయించుచున్నాము.

ప్రస్తుత స్తోత్రకర్త ప్రాయశః వానాచలయతీశ్వరుల (వానమామలై జీయర్ను) శిష్యులై యుండుటచే, తమ ఆచార్యసంబంధమునుబట్టి పద్మావతీదేవి తమను ఆదరించి, రక్షించెనని పల్కిరని అనదగును. ఇట్లు పల్కుట సదాచార్యసమ్మతము. శ్రీయామునులు స్తోత్రరత్నము చివరలో "పితామహం నాథమునిం విలోక్య ప్రసీద

మద్వృత్త మచింతయిత్వా” అని పల్కిరి. అట్టి క్రమమును పలువురు ఆచార్యులు అనుసరించిరి. శ్రీవాధూల వీరరాఘవాచార్యులవారు (అణ్ణావప్పంగార్) తాము రచించిన “శ్రీరామానుజాతిమానుషస్తవ” మను స్తోత్రములో చివర (ఇంతవరకు అముద్రితము) “త్వత్పాదభక్తిభరితానమలాన్ గురూన్ మే. సౌమ్యోపయంతృయమినం ప్రవణం త్వదంఘ్రౌ, త్వద్భాగినేయమపి దాశరథిం విలోక్య రామానుజార్య ! మయి నిత్య మిహ ప్రసీద” అని ప్రార్థించిరి. ప్రస్తుతశ్లోకమున ఆ క్రమమే అనుసరింపబడినది.

లక్ష్మీదేవికి అసాధారణనామము శ్రీ అనునది. ఈ నామమునకు పెద్దలు ఆఱు విధములైన వ్యుత్పత్తులను చూపిరి. అవి వరుసగా -

1. “శ్రయతే పరం భగవంతమ్ ఇతి శ్రీః”-భగవానుని ఆశ్రయించునది కావున “శ్రీః”.
2. “శ్రీయతే ఇతి శ్రీః” -- అందరిచే ఆశ్రయింపబడునది కావున “శ్రీః”.
3. “శృణోతి ఇతిశ్రీః” -- ఆశ్రితుల ప్రార్థనను వినుచున్నది కావున “శ్రీః”.
4. “శ్రావయతి ఇతి శ్రీః” -- ఆశ్రితుల ప్రార్థనలను స్వామికి వినిపించుచున్నది కావున “శ్రీః”.
5. “శృణాతి దోషాన్ ఇతి శ్రీః” ఆశ్రితుల దోషములను పోగొట్టునది, కావున “శ్రీః ”.
6. “శ్రీణాతి గుణైః ఇతిశ్రీః”- తన సద్గుణములతో సర్వత్ర వ్యాపించునది కావున “శ్రీః”.

పై వ్యుత్పత్తులలో మొదటి రెండును ఈ స్తోత్రములోని మొదటి శ్లోకమున ప్రతిపాదింపబడుటనుగూర్చి ఆ శ్లోకవ్యాఖ్యలోనే వివరింపబడినది. ఆశ్రితుల మాటలను వినునది, వారి ప్రార్థనలను స్వామికి వినిపించునది- అను రెండు వ్యుత్పత్తులు “పూర్ణాగసి” అను 10వ శ్లోకమున తెలుపబడినదని చెప్పవచ్చును. అట్లే, ఆశ్రితుల దోషములను పోగొట్టునది - అను అయిదవవ్యుత్పత్తి వాత్సల్యగుణమును వివరించునది కావున “వాత్సల్యశీతల” ఇత్యాది 5వ శ్లోకములో, ఈ స్తోత్రములోని చివరిది అగు ప్రకృతశ్లోకములో సూచింపబడినది. గుణములతో అంతట వ్యాపించునది అను చివరి వ్యుత్పత్తి “యద్వైభవం న మాతు మల మాత్మవిదాదిదేవః” అను రెండవ శ్లోకమున చూపబడినది. ఇట్లు ఈ విధముగా ఈ స్తోత్రము సాకల్యముగా శ్రీపదార్థప్రతిపాదక మనదగినది. శ్రీయామునుల చతుఃశ్లోకి, కూరేశుల శ్రీస్తవము, శ్రీపరాశరభట్టర్కృతమగు శ్రీగుణరత్నకోశము, శ్రీ దేశికవిరచితమైన శ్రీస్తుతియు ద్వయమంత్రములోని శ్రీమత్



పదార్థమును వివరించు చున్నవని పూర్వాచార్యుల అభిప్రాయము. ఆ విధముగానే ప్రకృతస్తోత్రమును గూర్చి కూడ భావింపవచ్చును.

ఇట్టి అప్రమేయ ప్రమేయ వైభవమును కల ఈ స్తుతియందు ఇంకను పలు విశేషార్థములున్నవి. ఈ స్తోత్రము, అలర్మేల్మంగై మంగళాశాసన స్తోత్రము రెండును తాళపత్రప్రతిలో ఒకదానివెంట వేఱొకటి (ముందు ప్రపత్తి) ఉండుటచే ఇవి రెండును ఏకకర్తృకములుగా భావింప వీలున్నది. కనుక ఈ స్తుతినికూడ వాన మామలై యతీశ్వరుల శిష్యులెవరో రచించి యుందురని చెప్పవచ్చును.

శ్రీ వేంకటేశమహిషీం శ్రియమాశ్రయామః



# అలర్మేల్మంగై మంగళాశాసనము -సవ్యాఖ్యానము

1. శ్రీనివాసభుజామధ్యే భూషా యత్పాదపంకజమ్ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఏ పద్మావతిదేవియొక్క పాదకమలము శ్రీనివాసుని వక్షఃస్థలమునందు అలంకారమో, అట్టి, శ్రీనివాసుని పత్నియగు శ్రీదేవికి మంగళమగుగాక !

పరాశరభట్టర్ శ్రీ రంగరాజస్తవమున "లక్ష్మీపదలాక్షైకలక్షణమ్" అని, శ్రీ గుణరత్న కోశమున "వేదాంతాః తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి" అని, దేశికులు శ్రీ స్తుతిలో "తత్కల్యాణం కిమపి యమినా మేకలక్ష్యం సమాధౌ, పూర్ణం తేజః స్ఫురతి భవతీపాదలాక్షారసాంకమ్" అని, "వక్షఃపీఠీం మధువిజయినో భూషయంతీం స్వకాంత్యా" అనియు, వేంకటాధ్వరి లక్ష్మీసహస్రప్రారంభమున "లక్ష్మీచరణరాజీవ- లాక్షాలక్షితవక్షసే" అనియు పల్కుట ఇచట స్మరణీయములు. లక్ష్మీదేవి పాదముద్రలచే అలంకరింపబడిన వక్షస్సును కల్గిన శ్రీనివాసుడే పరతత్త్వమని వేదము నిర్ణయించినట్లు భట్టరు శ్రీగుణరత్నకోశమున "వేదాంతాః తత్త్వచింతామురభిదురసి యత్పాదచిహ్నైః తరంతి" అని పల్కిరి. ప్రపన్నులు నిత్యము చేయు భగవన్మంగళాశాసనము ప్రారంభమున "లక్ష్మీచరణలాక్షాంకసాక్షి శ్రీవత్సవక్షసే" అనుచు లక్ష్మీముద్రాంకితమైన వక్షస్సును కల భగవానునకు మంగళమును పాడు శ్లోక మిచట ఉదాహార్యము. అందు లక్ష్మీదేవి పాదములకు అలంకరింపబడిన పారాణిముద్రయే శ్రీవత్సమని తెలుపబడుటయు గమనింపతగినది. లక్ష్మీసంబంధము లేని దేవుడు సేవ్యుడు కాడనుటకు తిరుమళిశైయాళ్వార్లు నాన్ముకన్ తిరువన్దాది ప్రబంధమున "పొల్లాద తేవరై తేవరల్లారై త్తిరువిల్లా త్తేవరై త్తేఱేల్ మిన్ తేవు" అనుచు నిర్ద్వంద్వముగా తెలిపిరి కదా! అట్టి నిత్యసంబంధమును తెలుపును. లక్ష్మీపాదపంకజచిహ్నము.

"త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి" అనునట్లు భగవానుని పాదపద్మములు భక్తుల శిరస్సులకు భూషణములు కాగా, లక్ష్మీదేవి పాదపంకజము ఆ భగవానుని వక్షస్సునకు అలంకారమగుట విశేషము. ఈ స్తోత్రమునందు అంతట లక్ష్మీవైభవము ముఖ్యప్రమేయము. అందులకు ఈ ప్రయోగమొక నిదర్శనము. "కోమలాంగసుమనస్సందర్భణం దేవి ! తే కాంతోరఃప్రతియత్న మర్హతి" అనుచు భట్టరు లక్ష్మీదేవి సుకుమారములైన అంగములన్నియు స్వామి వక్షః స్థలమునకు అలంకారమని పల్కుచు ఆ వక్షఃస్థలమున గల వనమాలకూడ లక్ష్మియొక్క పాదోపమర్దముచే కొత్త సొబగు సంతరించుకొన్నదనిరి.



పద్మావతీదేవి అవతారకథయు ఇందు గూఢముగా సూచింపబడినదనియు చెప్ప వచ్చును. భగవానుని వక్షఃస్థలముననున్న లక్ష్మీదేవి భృగుమహర్షి పాదముల తాకిడిచే కోపించి పద్మావతిగా అవతరించుట, పిమ్మట స్వామి శ్రీనివాసుడై ఆమెను వివాహమాడుట ఇత్యాదిగా వర్ణింపబడు పౌరాణిక వృత్తాంతము శ్లోకములోని పూర్వార్ధమున సూచింపబడినది. శిశుపాల వధలోని "నిహితభుజయా లతయైకయోపకంఠే" ఇత్యాది ప్రయోగములనుబట్టి "భుజా" అను స్త్రీలింగప్రయోగములు కలవు అని తెలియనగును. "భూషణః" అని సహస్ర నామమున కీర్తింపబడిన స్వామి బాహువులను సర్వభూషణ భూషార్హములనుచు వాల్మీకి పొగడెను. ఆ బాహుమధ్యమునకే లక్ష్మీదేవి పాదము అలంకారమనుట ఇందలి విశేషము.

2. అస్యేశానాదివేదాంతాః యత్స్వరూపైకగోచరాః ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

"అస్యేశానో జగతో విష్ణుపత్నీ", "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ", "ఈశ్వరీం సర్వభూతానామ్" అను మొదలగు వేదాంతవాక్యములు ఏ లక్ష్మీదేవి స్వరూపనిర్ణయము నందే దృష్టిని కల్గినవో, అట్టి, వేంకటేశ్వరునిపత్నియగు శ్రీదేవికి (పద్మావతికి) మంగళమగు గాక!

ఈ శ్లోకముకూడ పరాశరభట్టర్ కృతమగు శ్రీ గుణరత్నకోశములోని "అస్యేశానా జగతి ఇతి తే-ధీమహే యాం సమృద్ధిం, శ్రీః! శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్" అను శ్లోకార్థమును అనుసరించుచు రచింపబడినది. "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" అను వాక్యము నీళాసూక్తమున కలదు. అయినను శ్రీదేవి నీళాదేవుల మధ్యగల అభేదభావనతో ఇతట ఈ వాక్యము లక్ష్మీపరముగా అనుసంధింపబడినది. భూదేవీ, నీళాదేవులు లక్ష్మీదేవికంటే భిన్నలు కారని, వారు ఆమె నీడవంటివారే అనుటను నమ్మాళ్వార్లు తిరువిరుత్తప్రబంధమున "తిరువుమ్ నిల్ పోల్వనర్" అనుచు సూచించిరి. ఈ భావమునే పొయ్గై ఆళ్వార్లు "తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్ శేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్దవాఱెన్ కొల్?" అనుచు ఆశ్చర్యముగా అనుసంధించిరి. భట్టరును శ్రీ గుణరత్నకోశమున "దేవ్యస్సహస్రం తథా యాభిస్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః" ఇత్యాదిగా ఈ అంశమును కీర్తించిరి. అంతేకాక, పైన ఉదాహరించిన తిరువిరుత్త పాశుర భావమును శ్రీరంగరాజస్తవమున "ఛాయా మివాభ్యుదయనీం మవనీం చ తస్యాః " అని, "ప్రతిఫలన మివాస్యాః పశ్య విశ్వంభరాం చ" అనియు అనువదించిరి. కావున నీళాదేవి విషయమున వేదము పల్కిన వాక్యమును లక్ష్మీపరముగా అన్వయించుట సముచితమేకదా!

శ్రీసూక్తమున స్పష్టముగా లక్ష్మీవైభవము తెలుపబడుటచే అది లక్ష్మీవైభవ ప్రతిపాదక మనుటలో విప్రతిపత్తి లేదు. కాని, పురుషసూక్తాదులలో పురుషోత్తముడగు భగవానుని వైభవమే ప్రతిపాదింపబడుటనుబట్టియు, "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః" ఇత్యాది స్మృతివచనములబట్టియు వేదము సమగ్రముగా భగవద్వైభవప్రతిపాదకమని తెలియుచుండగా, "త్వత్స్వరూపైకగోచరాః" అనుచు వేదములన్నియు లక్ష్మీవైభవ ప్రతిపాదకములనుట ఎట్లు పొసగును? అనినచో - భట్టరు సాయించిన "ఈష్టే కశ్చిత్ జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః తం చ త్వత్కం పతి మధిజగౌ ఉత్తరశ్చానువాకః " అను శ్లోకరత్నములోని భావము అందులకు సమాధానముగా అనుసంధేయము. పురుష సూక్తములో, నారాయణానువాకములో స్తుతింపబడిన పురుషుడే, "అద్భ్యః సంభూతః" అను ఉత్తరానువాకములోకూడ వర్ణింపబడుచుండుటచే, ఆ పురుషుడు "హ్రీశ్చ లక్ష్మీశ్చ పత్న్యౌ" అని, "శ్రద్ధయా-దేవో దేవత్వ మశ్నుతే" అను వాక్యములద్వారా లక్ష్మీపతిగా, ఆ లక్ష్మీసంబంధమువలన అతిశయమును పొందినవాడుగా చెప్పబడుటచే భగవద్వైభవమును వర్ణించు వేదము అంతయు, లక్ష్మీ వైభవమును తెలుపు శ్రీసూక్తాదులు, భగవానుని మహిమను పలుకు పురుషసూక్తాదులును అన్నియు శ్రీ వైభవమునే ప్రతిపాదించుచున్నవనదగును.

ఇట్లయిన వేదములు లక్ష్మీవైభవమును నేరుగా ప్రతిపాదింపక, ఇట్లు పరోక్షముగా తెలుపుట ఏల? అను ప్రశ్న కలుగవచ్చును. దీనికి భట్టరు శ్రీగుణరత్నకోశమున చక్కని సమాధానమును పల్కుచు ఇట్లనిరి. "స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే! త్వదాశ్లేషోత్కర్షాత్ భవతి ఖలు నిష్కర్షసమయే, త్వమాసీః మాతః! శ్రీః కమితు రిదమిత్థంత్వ విభవః తదంతర్భావాత్ త్వం న పృథగభిధత్తే శ్రుతిరపి" భగవానుని స్వరూపము, స్వాతంత్ర్యమును లక్ష్మీదేవిసంబంధమువలన కల్గిన ఉత్కర్షను పురస్కరించుకొనియే నిర్ణయింపబడుచున్నది. భగవానుడు ఇతడని, ఇట్టివాడని తెలుపుటలో లక్ష్మీదేవియే నిరూపిక అగుటచే వేదమునకు ప్రత్యేకముగా ఇక ఆమెనుగూర్చి ప్రస్తావింప నవసరములేక పోయెనని పై శ్లోకతాత్పర్యము. కావున అన్ని విధముల శ్రీదేవి భగవానుని స్వరూపనిరూపిక- అని సిద్ధించినదికదా! భూతయోగియు "తిరుక్కణ్డేన్ పొన్ మేని కణ్డేన్" అనుచు శ్రీదేవియే పరతత్త్వమును నిరూపించుచున్నదనిరి.

ఇక, లక్ష్మియే భగవానుని ఇదంత్వ- ఇత్థంత్వములను నిరూపించుచున్నదనుటను ఇచట వివరింపవలసియున్నది. ఒక వస్తువును నిరూపించు ధర్మములు స్వరూప నిరూపకములని, నిరూపితస్వరూప విశేషణములని రెండు విధములు. ఏ ధర్మమును పురస్కరించుకొనకుండా ఒక వస్తువుయొక్క స్వరూపమును నిరూపింపసాధ్యము కాదో



ఆ ధర్మమునకు స్వరూప నిరూపకమని పేరు. కుండను నిరూపించునపుడు దానికి కల సంస్థానము - అనగా - నోరును కల్గియుండుట, గుండ్రని పొట్టను కల్గియుండుటవంటివి అట్టివి. ఈ రీతిలో శ్రీదేవిని విడచి భగవత్స్వరూపమును నిరూపింప వీలుపడదు. ఏల అన, ఆమెను విడచి భగవానుడు ఉండడు, ఉండలేడు కదా! "అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా", "అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా" అను దివ్యదంపతుల ఇరువురి వాక్కు ఇందులకు సాక్ష్యము. అహమను ఆధారవస్తువు లేనిచో అహంత సిద్ధింపనట్లే, అహంతను విడచి అహమనునది సిద్ధింపదు. అహంశబ్దవాచ్యుడు పరమాత్మకాగా, అహంత లక్ష్మియే. ఇందులకు ఈ ప్రమాణమును గమనింపవచ్చును. "ప్రభేవ దివసేశస్య జ్యోత్స్నేవ హిమదీధితేః, అహంతయా వినా-హం హి నిరుపాఖ్యో న సిద్ధ్యతి, అహంతా బ్రహ్మణస్తస్య సా-హ మస్మి సనాతనీ". ఇట్లు భగవానుని నిరూపించు స్వరూపనిరూపక ధర్మము లక్ష్మీదేవియే అని సిద్ధించినది. అట్లే నిరూపితస్వరూప విశేషణ మును లక్ష్మియే. ఇందులకు "స్వాతంత్ర్యరూపా సా విష్ణోః" అను అహిర్బుధ్న్యసంహితా వచనమును ప్రమాణముగా గ్రహింపనగును. పైన ఉదాహరింపబడిన శ్రీగుణరత్నకోశ శ్లోకమున గల స్వరూపశబ్దము ఇదంత్వసూచకము, స్వాతంత్ర్యశబ్దము ఇత్థంత్వసూచకము. కావున లక్ష్మీదేవియే ఇదం- అంశముగా, ఇత్థం-అంశముగానున్నదని ఏర్పడినది. పరతత్త్వము శ్రియఃపతియే యగుట, అతడు లక్ష్మీవల్లభుడై స్వాతంత్ర్యాదిసకల కల్యాణగుణవిశిష్టుడగుటయు ఇందులకు హేతువు.

వేదవేదాంతములవలెనే స్మృతి-ఇతిహాస-పురాణాదులును లక్ష్మీ మాహాత్మ్యమును తెలుపుననియేయనుట ఆచార్యులందరి అభిమతము. దీనినిబట్టి వేదమున గూఢముగా తెలుపబడిన లక్ష్మీవైభవము స్మృతీతిహాసపురాణాదులలో విస్తరింపబడినది - అని తెలియు చున్నది. దీనిని సూచించుటకై వాల్మీకిభగవానులు శ్రీరామాయణమునుగూర్చి "సీతాయాః చరితం మహత్" అనుచు మహచ్ఛబ్ద ప్రయోగమును చేసిరి- అని అభిజ్ఞులగు ఆచార్యులందరి అభిప్రాయము. ఈ సందర్భమున "శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే" అను భట్టర్‌సూక్తిని అనుసంధింపనగును. పూర్వోక్త శ్రీ గుణరత్నకోశశ్లోకమున "ప్రథమే పుమాంసః" అను ప్రయోగముయొక్క, "పరాంకుశాద్యాః ప్రథమే పుమాంసః" అను శ్రీరంగరాజస్తవ ప్రయోగముయొక్క స్వారస్యమునుబట్టి వాల్మీకివ్యాసపరాశరాది మహర్షులనే కాక, ఆళ్వార్లు అనబడు దివ్యసూరులనుకూడ తెలుపునని, ఇందువలన ఈ అంశము ఉభయవేదాంతసమ్మతమని చెప్పనగును. ఇట్లు లక్ష్మీ వైభవమును కీర్తించుట చేతనే వేదములకు ఉత్కర్ష కల్గెనని "సురభితనిగమాంతం... తవ పాదయుగ్మమ్" అను సూక్తిద్వారా భట్టరు పల్కుటయు ఇచట ప్రస్తావనార్హము.

భగవానుని స్వరూపనిరూపకధర్మము, నిరూపితస్వరూపవిశేషణ ధర్మమును రెండును శ్రీదేవియే అనుటచే భగవానునకు కల పరత్వాదిసకలవిధములైన అతిశయములు లక్ష్మీమూలకములని ఏర్పడుచున్నవి. ఇట్లు పరాత్పరుడగుస్వామి కంటే అపృథక్ సిద్ధ విశేషణమగు లక్ష్మికి అతిశయమును ప్రతిపాదించుట భగవానుని తక్కువ చేయుటయే కదా! ఇది తగునా? అను శంక ఇక్కడ కలుగవచ్చును. ఇందులకును భట్టర్ చక్కని సమాధానమిచ్చిరి. అది ఏమనగా - స్వతః శ్రీః త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్ త్వదాయత్తర్ధిత్వే- ప్యభవదపరాధీనవిభవః, స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం న కుంఠం స్వాతంత్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్" అనునది. శ్రీదేవి వైభవమును గూర్చి పల్కుట ఆమెకు ప్రభువగు పరమాత్మ వైభవమును పల్కుటయే. రత్నమునకు విలువ దానికి కల కాంతిచే సిద్ధించినంతమాత్రమున రత్నము విగుణమగునా? రత్నమును కీర్తించినట్లే కదా అగును. శ్రీదేవివలన భగవానుడు అతిశయమును పొందెననుట కాంతిచే రత్నము విలువ పొందెనని పల్కుట వంటిదే. కావున భగవానునకు అపకర్షాపాదకము కానేరదు- అనునది ఇచటి తాత్పర్యము.

ఇట్లు వేదములు, స్మృతీతిహాసపురాణాదులు అన్నియు లక్ష్మీవైభవ ప్రతిపాదకములని, అట్లు ప్రతిపాదించుట భగవానుని గొప్పతనము తక్కువ చేసినట్లు కాదని, ఆ స్వామిని పొగడుటయేనని స్పష్టమైనది. ప్రస్తుతశ్లోక భావమునకు అనుగుణముగా దేశికుల శ్రీస్తుతిలోని "అస్యేశానా త్వమసి జగతః సంశ్రయంతీ ముకుందమ్", అను శ్లోకమును, "పద్మే పత్యుః తవ చ నిగమైః నిత్యమన్విష్యమాణః నావచ్ఛేదం భజతి మాహిమా" అను శ్లోకమును అనుసంధేయములు.

3. మంగళానాం సమస్తానాం వాసస్థానం యదీక్షణమ్ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఏ పద్మావతీదేవి చూపు అన్ని శుభములకు నెలవో, అట్టి శ్రీనివాసుని పత్నియగు లక్ష్మీదేవికి మంగళమగుగాక !

ఈ శ్లోకము "ఆకుగ్రామనియామకాదపి విభో రాసర్వనిర్వాహకాత్, ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరంగభర్తుః ప్రియే!, తుంగం మంగళ ముజ్జ్వలం గరిమవత్ పుణ్యం పునః పావనం ధన్యం యత్తదదశ్చ వీక్షణభువ స్తే పంచషా విప్రుషః" అను భట్టరుకృతశ్రీగుణరత్నకోశ శ్లోకమును, "యస్యాం యస్యాం దిశి విహరతే దేవి! దృష్టి స్త్వదీయా తస్యాం తస్యా మహమహమికాం తన్వతే సంపదోఘాః", "మంగళం మంగళా నామ్" అను దేశికుల శ్రీస్తుతిలోని సూక్తులను అనుసరించుచున్నది. ఇచట ఉదాహరింప



బడిన భట్టరు శ్లోకమున పూర్వార్ధములో చేతనులలోని సంపద, ఉత్తరార్ధమున అచేతనము లందుండు సంపదయు తెలుపబడుటయేకాక, వానికన్నిటికిని శ్రీదేవి కటాక్షలవలేశము మాత్రమే కారణమని చెప్పబడినది. కావున సమస్తశుభములకు లక్ష్మీదేవి కటాక్షములోని అత్యల్పమైన అంశమే చాలును.

మంగళముల కన్నిటికిని లక్ష్మీదేవి చూపులోని శతాంశమో, సహస్రాంశమో చాలినచో, ఇక ఆమె కటాక్షములు పూర్తిగా ప్రసరించినవాని వైభవమును వర్ణింప వీలగునా? కాదుకదా ! అట్టి భాగ్యమునకు నోచుకున్నవాడు పరమాత్మ అయ్యెను. "అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్" అనుచు భట్టరు ఈ విషయమునుగూర్చి పలుకగా, తిరుమజ్జైయ్యార్లు "మలరాళ్ నోక్క ముణ్డాన్" అని సాయించిరి. "శిదైక్కిన్దదో" అను తిరువిరుత్తపాశురవ్యాఖ్యలో నమ్బిళ్లై "ఇవళ్ కాట్పుట్ట మణల్ పరతత్త్వమాకాదో! ఎన్దరుళిచ్చెయ్తార్" - శ్రీదేవి పాదస్పర్శ సోకిన ఇసుకయే పరబ్రహ్మమగుననుచు పల్కిన భట్టర్ శ్రీసూక్తిని ఉదాహరించిరి. ఇక ఆమె పరిపూర్ణ కటాక్షమును పొందినచో పరబ్రహ్మమగుటలో ఆశ్చర్యమేమి! "శ్రీమతాం వరః" అను నామము ఈ విషయమునే తెలుపు నని భట్టరు వివరించిరి. "ధన్యం మన్యత ఈక్షణాత్ తవ యతః స్వాత్మాన మాత్మేశ్వరః" అనుచు కూరేశులు లక్ష్మీకటాక్షము తనపై ప్రసరించుట వలన తనను ధన్యునిగా భావించెననిరి. వేదమును ఈ అంశమును "శ్రద్ధయా-దేవో దేవత్వమశ్నుతే" అనుట ద్వారా సంగ్రహముగా తెల్పినది. ఈ సందర్భమున శ్రీస్తవములోని "ఐశ్వర్యం యద శేషపుంసి యదిదం సౌందర్యలావణ్యయోః, రూపం యచ్ఛహి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీన మేవ" అను సూక్తియు అనుసంధేయము.

4. ఆశ్రుతానంతదురితక్షాళనం యద్విచింతనమ్ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఏ శ్రీదేవియొక్క తలపు ఇంతవరకు వినని, అంతులేని పాపములను అయినను కడిగి వేయునో, అట్టి శ్రీనివాసుని పత్నియగు పద్మావతికి మంగళమగు గాక !

శ్రీసూక్తములోని "అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే", "అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్నుద మే గృహాత్" ఇత్యాది సూక్తులను, అష్టోత్తరశతనామస్తోత్రములోని "లోకశోక వినాశినీమ్" ఇత్యాది నామములను, దేశికుల శ్రీస్తుతిలోని "దూరీకర్తుం దురిత నివహం త్యక్తు మాద్యా మవిద్యామ్" అను సూక్తిని ఇచట స్మరింపనగును. లక్ష్మీదేవి లోకమాత యగుటచే సహజమైన మాతృత్వప్రయుక్తమగు వాత్సల్యము ఆమె యందు అతిశయించి యుండును. కావున ఆమె మన దురితములు ఎట్టివైనను వానిని క్షమించి, రక్షించుననుట

స్పష్టము. భగవానుడు సైతము క్షమింపనొల్లని దోషములను కూడా "కిమేతత్ నిర్దోషః కః ఇహ జగతి" (ఏమిది! ఈ లోకమున తప్పు చేయనివాడెవ్వడు) అని, "న కశ్చిత్ నాపరాధ్యతి" (తప్పు చేయనివాడు లేడు) అని పల్కుచు ఆ స్వామి వానిని క్షమించునట్లు చేయును. కావుననే భట్టరు భగవానుని క్షమకంటె లక్ష్మీదేవి క్షమ గొప్పదనుటను "రాక్షసీః.... ఆర్ద్రాపరాధాః త్వయా రక్షంత్యా పవనాత్మజాత్ లఘుతరా రామస్య గోష్ఠీకృతా" అనుచు సూచించిరి. కావున ఎట్టి పాపమైనను ఆమె స్మరణమువలన నశించుననుటలో సందేహము లేదు. నమ్మాழ்వార్లుకూడ "వేరి మాఱాద పూమే లిరుప్పాళ్ వినై తీర్క్కుమే" అనుచు పద్మావతీదేవి సకలదురితములను తీర్చుననిరి.

5. యద్వీక్షయా జగత్సృష్టిస్థిత్యంతానకరోత్ హరిః ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఏ పద్మావతీదేవి కటాక్షముచే భగవానుడు లోకముల సృష్టి-స్థితి-లయములను చేసెనో, అట్టి, శ్రీనివాసుని పత్నియగు లక్ష్మీదేవికి మంగళమగుగాక !

శ్రీపరాశరభట్టరు శ్రీగుణరత్నకోశ ప్రారంభమున "శ్రియై సమస్తచిదచిద్విధాన వ్యసనం హరేః, అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై" అనుచు పరమాత్మ జగత్సృష్టిని చేయుటలో చేసిన యత్నమును శ్రీదేవి తన కటాక్షముతో అంగీకరించుటద్వారా సఫలము చేయుననిరి. అట్లే, కూరేశులు శ్రీస్తవ ప్రారంభమున "అశేషజగతాం సర్గోపసర్గస్థితీః స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః, యస్యా వీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తే-ఖిలమ్" అనిరి.

ప్రస్తుతశ్లోకమున హరిశబ్దప్రయోగస్వారస్యము గమనింపతగినది. "సమస్త చిదచిద్విధానవ్యసనం హరేః" అని భట్టరు, "సర్వం చ కుర్వన్ హరిః" అని కూరేశులును సృష్ట్యాదికార్యములను చేయు స్వామిని హరిశబ్దముతో నిర్దేశించిరి. ఇందులకు ఆ శబ్ద ప్రయోగ మిచట అన్ని విధముల తగియుండుటయే హేతువు. శ్రీ రామకృష్ణ అయ్యంగార్ స్వామివారు "సువర్ణకుంచిక" అను తమ శ్రీగుణరత్నకోశవ్యాఖ్యలో ఈ అంశమును వివరించుచు ఇట్లనిరి. "బ్రహ్మాణ మింద్రం రుద్రం చ యమం వరుణ మేవ చ, ప్రసహ్య హరతే యస్మాత్ తస్మాత్ హరిరీతీర్యతే" అనునట్లు అందరిని సంహరించునపుడు తానొక్కడే ఉండుటచే భగవానుని లోకసంహర్తృత్వమును హరిశబ్దము తెలుపును. "సంహరతీతి హరిః"- అను వ్యుత్పత్తి ఇచట వివక్షితము. "భూతానాం ప్రభవో హరిః" అను ప్రమాణము వలన జగత్సృష్టిని చేయువాడు హరియని తెలిపుచున్నది. సృజించుటకు వలసిన సమస్తగుణములను కల్గియుండుటనుకూడ ఈ పేరు తెలుపును. అట్లే, "హరి

ర్హరతి పాపాని" అను సూక్తి పాపములను పోగొట్టునపుడు ఉండవలసిన జ్ఞానము, శక్తి, క్షమ, దయ మొదలగు గుణములను కల్గియుండుటను తెలుపును. కావున హరిశబ్దము రక్షకత్వమును సూచించును. ఇట్లు ఈ నామము సృష్టి స్థితి సంహారములను చేయగల్గుటను సూచించును. పై వివరణములన్నియు "ఉపసర్గార్థస్య ధాతౌ లీనత్వాత్" అను న్యాయముచొప్పున చేయబడినవి. ఈ విధముగానే "ఉపహరతీతి హరిః" అను వ్యుత్పత్తివలన తాను సృష్టించిన జగత్తును శ్రీదేవికి కానుకగా సమర్పించువాడను అర్థమును హరి శబ్దమునకు చెప్పవచ్చును. కావున ప్రస్తుతశ్లోకమున హరిశబ్దప్రయోగము సర్వథా స్వరసము. శ్రీదేవికి గల "హరిప్రియా" అను నామముయొక్క "హరిః ప్రియః యస్యాః సా" అను వ్యుత్పత్తి ఇచట మిక్కిలి పొసగియుండుటయు గమనింపనగును.

ఈ శ్లోకమున "యద్వీక్షయా" అనుచు తృతీయావిభక్తి ప్రయోగించుటచే సృష్టిస్థితిసంహారములకు అన్నిటికి లక్ష్మీదేవికటాక్షము కారణమని తెలియుచున్నది. ఇందులకు అనుగుణముగా "ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ నిర్వాహకోరకితనేమ కటాక్షలీలామ్" అను శ్రీ గుణరత్నకోశసూక్తి అనుసంధేయము. ఇచటి "నిర్వాహ" శబ్దము సంహారమును తెలుపునని, లేనిచో "పాలిత" అను శబ్దము పూర్వపాదముననే ప్రయోగింపబడినందున నిర్వాహశబ్దప్రయోగము పునరుక్తియగునని వ్యాఖ్యాతలు అభిప్రాయపడిరి. "నిర్వహణం తు నిష్ఠా స్త్రీ సంహారశ్చ సమా పరే" అను శబ్దార్ణవనిఘంటు వచన మిందులకు ప్రమాణము. సృష్టిస్థితిలయలనెడి మూడు దశలలో భగవానుడు సలక్ష్మీకుడగుటను వేదమే తెలిపినది. "ఆనీదవాతగ్ం స్వధయా తదేకమ్" అను శ్రుతి వాక్యములోని స్వధా శబ్దము "స్వధా త్వం లోకభావినీ" అనుటనుబట్టి లక్ష్మీదేవిని తెలుపునని తెలియుచున్నది. "స్వధా త్వం లోకబృంహణాత్- ఇత్యుపబృంహణాత్ లక్ష్మీ విశిష్టత్వ ముచ్యతే" అనుచు శ్రుతప్రకాశికాకారులును "శ్రేష్ఠశ్చ" అను సూత్రముయొక్క భాష్యమును వ్యాఖ్యానించుచు ఈ అంశమును తెలిపిరి. కావున ప్రళయకాలమున భగవానుడు లక్ష్మీసహితుడనుట సిద్ధము. అట్లే, "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి" అను వేదసూక్తి (కాలము మొదలగునవి విద్యుత్తుతో కూడిన పురుషునివలన పుట్టినవి) సూచించుచున్నది. ఇచటి విద్యుల్లేఖ లక్ష్మీదేవియే. ఇక, రక్షణకార్యమున పురుషకార రూపిణియగు లక్ష్మీదేవి స్వామివెంటనే ఉండి ప్రోత్సహించుట సుప్రసిద్ధము.

వేదాంతములలోని "యతో వా ఇమాని భూతాని" ఇత్యాదిగా గల వాక్యములను బట్టి బ్రహ్మసూత్రాదులలోని "జన్మాద్యస్య యతః" ఇత్యాది సూక్తులనుబట్టి పరబ్రహ్మమే జగత్సృష్ట్యాదులకు కారణమని తెలియుచుండగా, లక్ష్మీదేవికటాక్షము కారణమనుట

ఎట్లు పొసగును? అను ప్రశ్న ఇచట ఏర్పడును. ఇందులకు సమాధానమును శ్రీరామకృష్ణ అయ్యంగార్ తమ శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యలో తెలుపుచు ఇట్లనిరి. లక్ష్మీకటాక్షమువలన లోకము ఉత్పన్నమయ్యెనని చెప్పబడెనే కాని, లక్ష్మియే లోకముగా వికరించెనని చెప్పబడకపోవుట గమనింపతగినది. కావున సృష్టిలో లక్ష్మీదేవికి ఉపాదానకారణత్వము లేదు. అంతమాత్రముచే ఈమెకు అందు సంబంధమే లేదనుట వీలుకాదు. జగత్కారణత్వ ములో లక్ష్మీదేవికిని సంబంధము కలదా? అని నడాదూర్ అమ్మాళ్ అను ఆచార్యులు పిళ్ళాన్ అను వేఱొక ఆచార్యులను ప్రశ్నింపగా -- "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చ ఉత్పాదయితవ్యాః" అను ప్రమాణములవలన సహధర్మచారిణియగు ఈమెకును సంబంధము కలదనుటలో సందేహమేమి?, అని సమాధానము నొసగిరట. దీని తాత్పర్యమేమనగా - గృహస్థ ధర్మమున దంపతులిద్దరికిని అన్వయము కలదు. "సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" అనునది మర్యాదాపురుషోత్తముని ఆచరణము. లోకసృష్టి భగవానుని గృహస్థధర్మము. కావున దాని ఆచరణము లక్ష్మీదేవి లేనిదే వీలు కాదు అనుటయే. "లోకవత్తు లీలాకైవల్యమ్", "హరే! విహరసి క్రీడాం కందుకై రివ జంతుభిః", "ఇన్బమురు మివ్విళైయాట్టుడైయానై" ఇత్యాది పలు సూక్తులు భగవానుని సృష్ట్యాదికార్యములు లీలకొఱకేనని తెలుపు చున్నవి. వేదము "శ్రద్ధయా-దేవో దేవత్వ మశ్నుతే" అనుచు క్రీడార్థకమగు దేవశబ్దముయొక్క అర్థపూర్తి శ్రద్ధారూపిణియగు లక్ష్మీదేవివలననే సిద్ధించునని అన్నది. ఇట్లు ఈ విధముగా సృష్ట్యాదులలో లక్ష్మీదేవికిని సంబంధమున్నదనుటను విదితము. అయిన ఆ సంబంధమెట్టిదనగా, భగవానుడు చేయు సృష్ట్యాదికార్యములను తన కడగంటి చూపులతో అంగీకరించుటయే. శ్రీరంగరాజస్తవమున "అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్" అనుటకూడ ఇట్టిదే. పురులు విప్పి ఆడునది మగనెమలి ఆడు ఆటను చూచి అంగీకరించుచు, సంతోషించుట ఆడునెమలి పని. కావున ప్రస్తుతశ్లోకములోని "యద్వీక్షయా" అను తృతీయావిభక్తి ప్రయోగము "సహయుక్తే-ప్రధానే" అనునట్లు అప్రధానకారణత్వమును తెలుపును.

"యద్వీక్షయా" అను ప్రయోగమునకు వేఱొక విధమైన అర్థమును కూడ చెప్పవచ్చును. "హేతోః" (2-3-23) అను సూత్రమును కౌముదీకారుడు వివరించుచు "అధ్యయనేన వసతి" ఇత్యాది ప్రయోగములలోని ఫలమును హేతువుగా గొని తృతీయను ప్రయోగింపవచ్చుననెను. అట్లే ఇచటను "యద్వీక్షయా" అనుటకు "యద్వీక్షార్థమ్" అను ఫలరూపమైన అర్థమును గ్రహించి, 'ఎవరి కటాక్షమును ఫలమును పొందుటకై'- అను భావమును చెప్పవచ్చును. అపుడు భగవానుడు సృష్ట్యాదులను చేయుట లక్ష్మీదేవి



కటాక్షములను పొందుటకొఱకు- అని ఎర్పడును. తాను చేసిన సృష్టిని ఆమె చూచిన మాత్రముననే సఫలమైనదని భగవానుడు ఉప్పొంగును. ఆమె కడగంటి చూపులకొఱకే గదా! అతడు పడు పాట్లన్నియును. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అనునట్లు తన వీక్షణముద్వారా (సంకల్పముద్వారా) సర్వసృష్టిని చేయగల్గిన స్వామి లక్ష్మీదేవి కటాక్షములకై తహతహలాడుట ఎంతటి చిత్రము! వారి దివ్యదాంపత్యమెంత మధురము "కటాక్షలాభాయ కరోతి లోకాన్ పరాక్రమం తే పరిరంభణాయ, ముదే చ ముక్తిం మురభిద్రమే! తత్ కథం ఫలాలాభకథా-స్య భర్తుః" అను శ్లోకరత్నముయొక్క భావమిచట అనుసంధేయము.

లక్ష్మీదేవి విషయమునగల పలు విప్రతిపత్తులుకూడ ఈ శ్లోకమున గూఢముగా నిరాకరింపబడినవి అని చెప్పవచ్చును. కొందరు ఈమె భగవంతుని సత్త అహంతల రూపము మాత్రమేనని, ప్రత్యేకతత్త్వము కాదని వాదింతురు. కొందరు మూలప్రకృతియే లక్ష్మి అందురు. శక్తి సహితుడైన భగవానుడే లక్ష్మీస్వరూపము- అని మఱి కొందరి వాదము. భగవానుడు సృష్టిని చేయుట లక్ష్మీదేవి కటాక్షముల కొఱకనుటచే ఆ స్వామికంటే లక్ష్మి వేఱనుట స్పష్టము. భగవత్ సృష్టిని ఆమె ఆమోదించుననుట ఇచట ధ్వనించుటచే అచేతనములైన అహంత, సత్తలే లక్ష్మి- అను వాదము పరాస్తము. భగవానుని వ్యాపారమును సఫలమును చేయుననుటచే ఆమె పరత్వము, మనము ఆశ్రయించి, మంగళమును ఆశాసింప తగినట్లుండుటచే సౌలభ్యమును వ్యక్తమగుచున్నవి.

6. యల్లీలార్థం జగత్సృష్ట మీశ్వరేణ మురారిణా ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఏ లక్ష్మీదేవి లీలకొఱకు (ఆనందమునకై) ఈశ్వరుడగు మురారి ఈ ప్రపంచమును సృష్టించెనో, అట్టి వేంకటపతికి ధర్మపత్నియగు శ్రీదేవికి మంగళమగు గాక !

పూర్వశ్లోకరచనములోవలె ఈ శ్లోకరచనమునందును భట్టరు ప్రభావము కలదు. భట్టరు శ్రీగుణరత్నకోశమున "కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్యమాలింగతోః భూతాహంకృతిబుద్ధిపంచకరణీ స్వాంతప్రవృత్తీంద్రియైః, అండానావరణైః సహస్ర మకరోత్ తాన్ భూర్భువస్సర్వతః శ్రీరంగేశ్వరదేవి ! తే విహృతయే సంకల్పమానః ప్రియః" అను శ్లోకముద్వారా (సృష్టికి పూర్వము నామరూపవిభాగానర్హమై, ఒకదానితో వేఱొకటి కలసియున్న చిదచిత్తులను నీ ప్రియుడగు స్వామి నీ ఆనందముకొఱకు సృష్టి చేయ సంకల్పించి, పంచభూతములను, అహంకారతత్త్వమును, మహత్తును, అయిదు జ్ఞానేంద్రియములను, మనస్సును, కర్మేంద్రియములను, వీనితో ఏడు ఆవరణములతో

ప్రసిద్ధములైన భూలోక, భువర్లోక, స్వర్లోకములను పలు అండములను సృష్టించెను) లక్ష్మీదేవి లీలకొఱకే భగవానుడు సృష్టిని చేసెననిరి. దేశికులు శ్రీస్తుతిలో "పశ్యంతీషు శ్రుతిషు పరితః సూరిబృందేన సార్ధం మధ్యేకృత్య త్రిగుణఫలకం నిర్మిత స్థానభేదమ్, విశ్వాధీశప్రణయిని! సదా విభ్రమద్యూతవృత్తౌ బ్రహ్మేశాద్యా దధతి యువయో రక్షశారప్రచారమ్" అనుచు అండములను దివ్యదంపతులు చదరంగపు బల్లగా, బ్రహ్మాదులను పాచికలుగా వర్ణించుటయు ఇట్టిదే.

మహావిద్వాన్ కాంచీ ప్రభ అణ్ణాస్వామివారు తమ శ్రీ గుణరత్నకోశవ్యాఖ్యలో పై శ్లోకార్థమును వివరించుచు "పలు విధములైన బ్రహ్మాండములతో కూడిన ఈ విభూతికి లీలా విభూతి అని పేరు. అది ఎవరి యొక్క లీల? అని చెప్పవలెను. ఇరువురకును ఆనందము కల్గినను ముఖ్యముగా శ్రీదేవి ఆనందమును ఉద్దేశించియే భగవానుడు సృష్టిని చేసెననుట భగవానుని పరమ రసికత్వమును పొగడుటయే" అని రసఘనముగా పల్కిరి. సృష్టి రచననుగూర్చి పల్కు సందర్భమున భట్టరు (శ్రీగుణరత్నకోశములో) "మురారేః", "మురజిత్" అనుచు ప్రయోగించుటనుబట్టి ప్రస్తుత స్తోత్రమునందును స్తోత్రకర్త మురారి శబ్దమును ప్రయోగించిరి. శత్రునిరసనమొనర్చుటలో శ్రీదేవి స్వామిని పురికొల్పకున్నను, సృష్టికార్యమున ఆమె ప్రోత్సాహము తప్పని సరి- అను అంశమును స్ఫురింపచేయుటకై మురారి అను నామమును భట్టరు ప్రయోగించిరని, ఈ పదము శక్తిని కల్గియుండుటను తెలుపుచు అట్టి స్థితిలో శ్రీదేవి ముఖమును చూచు భగవానుని స్థితిని తెల్పునని "యద్భ్రూభంగాః" అను శ్లోకవ్యాఖ్యలో శ్రీమాన్ రామకృష్ణ అయ్యంగార్ తెల్పిన వివరణము ప్రకృతమునను అనుసంధేయము.

7. చరాచర మిదం సర్వం యత్కటాక్షాత్ సుఖోత్తమమ్ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

ఈ చరాచర ప్రపంచమంతయు ఎవరి కటాక్షమువలన గొప్ప సుఖమును పొందుచున్నదో, అట్టి శ్రీనివాసుని పత్నియగు శ్రీదేవికి మంగళమగుగాక !

సమస్తచరాచరప్రపంచము లక్ష్మీదేవికటాక్షమువలన అతిశయితమైన సుఖమును పొందుననుటకు అనుగుణముగా "లబ్ధ్వా భూయః త్రిభువన మిదం లక్షితం త్వత్కటాక్షైః సర్వాకారస్థిరసముదయాం సంపదం నిర్విశంతి" అనుచు దేశికులు శ్రీ స్తుతిలో పల్కుటను అనుసంధింపనగును. శ్రీ పరాశరభట్టర్ శ్రీగుణరత్న కోశమున -- "అనోకహబృహస్పతి ప్రబలవిక్లబప్రక్రియమ్, ఇదం సదసదాత్మనా నిఖిల మేవ విమ్నోన్నతం, కటాక్షతదుపేక్షయో స్తవ హి లక్ష్మి తత్తాండవమ్". అని కూరేశులు --



"లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి" అని శ్రీస్తవమున పల్కుటనుబట్టి శ్లోకమును "ఇదం సర్వం యత్కటాక్షాత్ చరాచరం (భూత్వా) సుఖోత్తమం భవతి" అనియు అన్వయింపవచ్చునని తోచినను, "సుఖోత్తమమ్" అను పదమును చరాచరములు రెండింటికి అన్వయించుట స్వారస్యము లేనందున, పైన చూపిన అన్వయమే స్వరసము. "జగత్ సమస్తం యదపాంగసంశ్రయమ్" అనునట్లు భగవానుని నేత్రవైశాల్యమునందు సర్వప్రపంచము ఒదిగియున్నట్లే". "ఇదం సర్వం యత్కటాక్షాత్" అనుటచే శ్రీదేవి విశాలనేత్రముల కటాక్షమున సమస్తప్రపంచము ఒదిగియున్నదని ధ్వనించును.

8. పద్మాసనాయై పద్మాక్షపాణిపాదముఖశ్రియై ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

పద్మమును ఆసనముగా కల్గినది, పద్మములవంటి కన్నులను, హస్తములను, పాదములను, ముఖమును కల్గియుండుటవలన అపూర్వమైన శోభను కల్గియున్నది. అనిర్వచనీయమైన వైభవమును కల్గినదగు శ్రీనివాసుని పత్నియగు శ్రీదేవికి మంగళమగు గాక !

ప్రస్తుతశ్లోకమునకు అనుగుణముగా లక్ష్మీ అష్టోత్తరశతనామస్తోత్రములోని "పద్మాలయాం, పద్మహస్తాం, పద్మాక్షీం, పద్మసుందరీం, పద్మోద్భవాం, పద్మముఖీమ్" అను నామములను స్మరింపనగును. ఇట్లు లక్ష్మీదేవి పద్మములవంటి కన్నులను, పాదములను, కరములను, ముఖమును, ఆ పద్మమునే ఆసనపీఠముగను కల్గియుండుటచే, ఆమెకు తగిన అంతకు మించిన రూపమును గుణములను పొంది, ఆమెతో లీలా రసమును అనుభవింపనెంచిన భగవానుడు వందలకొలది, వేలకొలది పద్మములవంటి పాదములను, చేతులును, ముఖములను, "కణ్ణమ్ వాయుమ్ కైత్తలముమ్ అడియిణైయుమ్ కమలవణ్ణమ్", "తోళ్‌గళాయిరత్తాయ్" ఇత్యాదిగా ఆళ్వార్లు వర్ణించిన విధముగా పొందెను. కాని, లక్ష్మీదేవి అను గొప్ప లీలారసప్రవాహమునందలి సుడిలో ఒక మూల ఎక్కడో మునిగిపోయెనే కాని, పూర్ణముగా అనుభవింపలేకపోయెను. ఈ రస్యవిషయమును భట్టరు "దశశతపాణిపాదవదనాక్షిముఖై రఖిలైరపి నిజవైశ్వరూప్యవిభవై రనురూపగుణైః..... క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే" అను శ్లోకమున ప్రస్తుతించిరి. అట్టి గొప్పతనము లక్ష్మీదేవికి కలదనుట ప్రస్తుత శ్లోకములోని "తస్యై" అను సర్వనామ పదముద్వారా ధ్వనించునని చెప్పనగును.

భగవద్రామానుజులు శరణాగతిగద్య ప్రారంభమున లక్ష్మీదేవిని ప్రపత్తి చేయుచు

"పద్మవనాలయామ్" అని స్తుతించుటను వ్యాఖ్యాతృచక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానించుచు- "పద్మశబ్దము మంగళమునకు ఉపలక్షణము. సర్వమంగళనివాసిని- అని భావము లేక, "సర్వగంధః" అనునట్టి సర్వేశ్వరునికూడ తన సంబంధముచే పరిమళితము చేయుననియు భావము. పద్మశబ్దముచే భోగ్యత ఉపలక్షింపబడుటచే నిరతిశయమైన భోగ్యతను కల్గినదనియు చెప్పవచ్చును" - అని పల్కుట ప్రస్తుతమున అనుసంధేయము. దేశికులును తమ గద్యవ్యాఖ్యలో -- "పద్మే స్థితాం పద్మవర్ణాం గంధద్వారామ్- ఇత్యాద్యామ్నాత సౌవర్ణ్యసౌగంధ్యాతిశయో-పి సూచితః. తచ్చరణవరణ మంత్రే చోక్తమ్ - తాం పద్మనేమీం శరణ మహం ప్రపద్యే" ఇతి. శ్రీ విష్ణుస్మృత్యాదిషు విస్తరేణోక్తానాం మాంగల్య విభూతిభేదానామ్ ఇయం విశేషతో దేవతేతి జ్ఞాపయితు మిహ సుప్రసిద్ధమంగళభూత పద్మవనోదాహరణమ్" అని పల్కుటయు ఇచట స్మరింపనగును. కావున ప్రస్తుతశ్లోకమున "పద్మాలయాయై" అను విశేషణమువలన పైన సూచింపబడిన లక్ష్మీదేవియొక్క సౌవర్ణ్య, సౌగంధ్యాదులతో పాటు, ఆమె మంగళవస్తువుల కన్నిటికిని అధిదేవత అను విషయముకూడ తెలుపబడినదని చెప్పనగును.

9. కల్యాణగుణశాలిన్యై కార్తస్వరవపుఃశ్రియై ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

కల్యాణగుణములచే శోభిల్లునది, బంగారువంటి మేని ఛాయను కల్గినది, శ్రీవేంకటేశ్వరుని పత్నియగు పద్మావతికి మంగళమగు గాక !

పూర్వశ్లోకమున లక్ష్మీదేవి యొక్క రూపసౌందర్యమును పొగడి, మంగళమును పల్కిన కవి ఇందు ఆమె రూపవైభవమును, గుణవైభవమును స్తుతించుచు, మంగళమును శాసించుచున్నారు.

"కల్యాణగుణశాలిన్యై" అను విశేషణముద్వారా సౌందర్య, సౌకుమార్య, లావణ్యాది రూపగుణములు, క్షమ, ఔదార్యము, వాత్సల్యము- మొదలగు స్వరూప గుణములును ప్రస్తుతములు, "ఐశ్వర్యశీలాద్యనవధికకల్యాణగుణామ్" అనుచు భగవద్రామానుజులు శరణాగతిగద్యలో పల్కుట ఇచట ఉదాహార్యము. ప్రస్తుత మంగళాశాసనస్తోత్రమున కవి పలు రీతులలో పరాశరభట్టర్ కృతమగు శ్రీగుణరత్నకోశములోని శ్లోకములను అనుసరించిరని పూర్వమే విస్తరముగా నిరూపింపబడినది. శ్రీ గుణరత్నకోశమున భట్టరు 32వ శ్లోకమునుండి 44వ శ్లోకమువరకు విశేషముగా వర్ణించిన కల్యాణ గుణములన్నిటిని దృష్టిలో నుంచుకొని ఈ విశేషణము ప్రయోగింపబడినదనవచ్చును. 32వ శ్లోకమున దివ్యదంపతుల సామాన్యగుణములగు జ్ఞానశక్తితేజోవీర్య ఐశ్వర్యములను, లావణ్య,



సౌందర్య, సౌగంధ్యాది గుణములను ప్రస్తుతించి, లక్ష్మీదేవి యందు అతిశయించియుండు ప్రత్యేకగుణములను 34వ శ్లోకమున "త్వయి స్త్రీత్వైకాంతాన్ ప్రదిమపతిపారార్థ్య కరుణాక్షమాదీన్ వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా" అనుచు తెలిపిరి. మనోమార్దవము, పతికి పరతంత్రయై యుండుట, దయ, క్షమ- మొదలగు గుణములు లక్ష్మీదేవికే ప్రత్యేకములని దీనివలన తెలియుచున్నది. కావున శ్లోకములోని "కల్యాణగుణ శాలిన్యై" అను సూక్తికి ఇట్టి స్త్రీత్వైకాంతములగు గుణములచే విశేషముగా శోభిల్లుచున్నది - "కల్యాణగుణైః శాలతే ప్రకాశతే- ఇతి కల్యాణగుణశాలినీ" అను అర్థమును ప్రకృతమున చెప్పవచ్చును.

లక్ష్మీదేవి జ్ఞానాదిషాడ్గుణ్యమును కల్గియుండుటను "జ్ఞానాదిషడ్గుణమయీ" అను మొదలగుప్రమాణములు తెలుపు చున్నవి. అట్లే, పురుషునకుచితమైన శత్రుశమనము, లక్ష్మియందును కలదనుటను "దైత్యదానవమర్దినీ" ఇత్యాది నామములు తెలుపును. స్త్రీ స్వభావమునకు తగినవిగా చెప్పబడు కరుణ, క్షమ మొదలగునవి భగవానునియందును కలవుకదా ! అట్లయిన, వానిని శ్రీదేవికి మాత్రమే తగిన ఏకాంతగుణములుగా గ్రహించుట ఎట్లు ? అను ప్రశ్నకు శ్రీరామకృష్ణ అయ్యంగార్ సరసమైన ఈ క్రింది సమాధానమును తెలిపిరి. శ్రీదేవి శత్రుశమనమును చేయుట అనగా- భగవంతుడా పనిని చేయునపుడు ఆటంకపఱుపక పోవుటయే. పరతంత్రము, దయకు, క్షమకు మాఱు పేరును అగు లక్ష్మి శత్రువునైనను సంహరింపనొల్లదు. ఇందులకు "అసందేశాత్తు రామస్య తపసశ్చాను పాలనాత్, న త్వాం కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హతేజసా" అను శ్రీరామాయణము లోని సీతావాక్యము ప్రమాణము. అందుచే లక్ష్మీదేవి శత్రుశమనాదిగుణములు పారతంత్ర్య మిశ్రితములగుటచే ఉత్కృష్టములు కావు. అట్లే, భగవానుని కరుణ మున్నగునవి నిరంకుశ స్వాతంత్ర్యమిశ్రితములగుటచే ఉత్కృష్టములు కావు. ఇట్లు భగవంతుడు లేనిచో పరతంత్రయగు శ్రీదేవికి శత్రుశమనగుణము లేదు. లక్ష్మి లేనిదే భగవానుని కరుణాది గుణములు పూర్తిగా ఉద్బుద్ధములు కావు. కావున శత్రుశమనాదిగుణములు భగవానునకు, కరుణాదులు లక్ష్మీదేవికిని ఏకాంతగుణములని చెప్పనగును. ఈ వివరణ మంతయు ''న హి నిందాన్యాయము'' ననుసరించిచేయబడినది- అని గ్రహింపనగును.

శరణాగతిగద్యలోని ''ఐశ్వర్యశీలాది'' అను సూక్తిని వ్యాఖ్యానించుచు పెరియవాచ్చాన్ పిళ్ళై లక్ష్మీదేవియొక్క ఐశ్వర్యమునుగూర్చి ఇట్లు పల్కిరి. "సర్వపదార్థ నియమనసామర్థ్యము ఐశ్వర్యము. త్రివిధచేతనులను తన స్వరూపముతో

నియమించును. భగవానుని ప్రణయిత్వగుణముతో నియమించును. ఎట్లనగా -- బద్ధులను కర్మానుగుణముగా నియమించును. నిత్యులను, ముక్తులను స్వరూపానుగుణముగా నియమించును'' అని ఇచటి ఐశ్వర్యపదము జ్ఞానాదిగుణములకును ఉపలక్షకమనియు ఆ ఆచార్యులు తెలిపిరి. అట్లే, శీల గుణమునుగూర్చి -- "ఇది రాక్షస స్త్రీలవిషయమున ప్రసిద్ధము" అనుచు వివరించిరి. ఈ రెండును పరత్వ - సౌలభ్య గుణములన్నిటికిని ఉపలక్షకములని చెప్పనగును.

లక్ష్మీదేవికి మిగిలిన భగవత్పత్నులకంటె విశేషముగానున్న ప్రత్యేకతలనుగూర్చి కున్దత్తూర్ ఐయన్ కుమారులగు అప్పన్ శ్రీనివాసాచార్యులు తమ అష్టశ్లోకీ వ్యాఖ్యలో "మహిషీభావమ్, ఆత్మానురూప్యమ్, అభిమతత్వమ్, భోగ్యతోత్కర్షమ్, నిరపాయత్వమ్, స్వరూప నిరూపకత్వమ్, శేషిత్వాంతర్భూతత్వమ్, ఆశ్రితాశ్రయణ నియమనమ్, వ్యవసాయ జనకత్వమ్, అపరాధానా మపాకరణత్వమ్, ప్రాప్యాంతర్భావమ్, అల్లాద మహిషికళైక్కు ఇల్లాద అవయవిభావమ్, ఛాయాభావమ్, తుడక్కమాన విశేషఙ్గళ్ ఇవళుక్కేయుళ్ళ తౌన్దాకైయాలే అధికై ఎన్న క్కుఱై యిల్లై" అని పల్కిరి. ఈ విశేషములన్నియు వివరణ సాపేక్షములగుటచే ఇచట ప్రస్తావింపబడలేదు. ఇట్లు ఇట్టి విశేషగుణములచే శోభిల్లుటను కూడ 'కల్యాణగుణశాలిన్యై' అను విశేషణమునకు తాత్పర్యముగా గ్రహింపవచ్చును.

"కార్తస్వరవపుః శ్రియై" అను విశేషణము లక్ష్మీదేవియొక్క దివ్యరూపమును స్తుతించుచున్నది. కార్తస్వరమనగా బంగారము 'హిరణ్యవర్ణామ్' అనుచు శ్రీసూక్తము, 'హిరణ్మయీమ్' అని లక్ష్మీ అష్టోత్తరము ఈ గుణమును తెల్పినవి. భట్టరు "ఘన కనకద్యుతీ" అని, దేశికులు "తావకీ మూర్తి రాద్యా తప్తజాంబూనదాభా" అనుచు ప్రస్తుతించిరి. "పొన్మలర్పావై" అని తిరుమంగై యాழ్వార్లు, "పొన్పావై" అని తిరుమழிశైయాழ్వార్లు "పొన్మాదిన్" అని నమ్మాழ్వార్లును ఈ అంశమును కీర్తించిరి. ఛాందోగ్యోపనిషత్తు భగవానుని "హిరణ్మయః పురుషో దృశ్యతే" అని హిరణ్యవర్ణునిగా పల్కినది. "కార్ కలన్ద మేనియాన్" అనునట్లు నల్లని మేఘముయొక్క వర్ణమువంటి కాంతిని కల్గిన స్వామిని ఇట్లు హిరణ్మయునిగా వర్ణించుటకు గల తాత్పర్యమును ఉపనిషద్భాష్యకారులు రమణీయమైన వర్ణమును కల్గియుండుటయేనని పల్కిరి. దేశికులు గీతాభాష్యతాత్పర్యచంద్రికలో పలు ఉపపత్తులను చూపుచు (4-6) "తత్ర మయూర కంఠచ్ఛవిశుద్ధహేమ- ఇతి శిల్పశాస్త్రానుసారాత్ శ్యామత్వసిద్ధిః" అనుచు నెమలి కంఠము రంగువంటిదని తెలిపిరి. మహామహోపాధ్యాయ శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామి



తత్త్వోపహారమను తమ గ్రంథమున ఈ విషయమును పేర్కొని, "మయూరగ్రీవాసాదృశ్యం వివక్షితమ్" అని రంగరామానుజభాష్యాదులలో ఉన్నట్లు తెల్పుచు, నీలవర్ణము, దానిపై బంగారువర్ణము మెరుగును రెండును కలిసి నెమలికంఠములోవలె భగవన్మూర్తిలో ఉన్నవనిరి. ఇట్లు బంగారువర్ణము భగవానుని మేనిలో ఉండుటకు స్వామి వక్షమున నిత్యవాసమును చేయు లక్ష్మీదేవి కార్తస్వరవర్ణమును కల్గియుండుటయే కారణమనదగును. భగవానుడు పుండరీకాక్షుడగుటకు లక్ష్మీదేవి హిరణ్యవర్ణము స్వామి నేత్రములో ప్రతిఫలించుట కారణమైనట్లే, స్వామి హిరణ్మయుడగుటకు హిరణ్యవర్ణయగు అమ్మవారే కారణమనదగును. "తస్య భాసా సర్వ మిదం విభాతి" అని కీర్తింపబడు స్వామినే శోభిల్లచేయు మహనీయమైన బంగారు వర్ణమును లక్ష్మీదేవి కల్గియుండుట విశేషము. అట్టి వైభవమును కీర్తించుచు కవి ఇందు మంగళమును ఆశాసించిరి.

10. దేవేశప్రాణనాయక్యై జనన్యై సర్వదేహినామ్ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

దేవతలకధిపతియగు భగవానునకు ప్రాణసఖి, సకలచేతన వర్గమునకు జనని, వేంకటేశ్వరుని ధర్మపత్ని అగు పద్మావతీదేవికి మంగళమగుగాక !

"అస్యేశానా జగతో విష్ణుపత్నీ" అను శ్రుతివాక్యభావము ఈ శ్లోకమునను అంతర్భవించియుండుట విశేషము. ఈ శ్రుతివాక్యములోని ఉభయసంబంధములను భగవద్రామానుజులు "దేవదేవదివ్యమహిషీమ్, అఖిలజగన్మాతరమ్" అని అనువదించుచు గద్యప్రారంభమున పల్కిరని "ఈశానాం జగతా మధీశదయితామ్" అను అష్టశ్లోకీసూక్తిని వివరించుచు అప్పన్ శ్రీనివాసాచార్యులవారు పల్కిరి. భగవద్రామానుజసూక్తి క్రమమున ప్రస్తుతశ్లోకము రచింపబడుట విశేషము. ఈ రెండు సంబంధములే శ్రీశబ్దమునకు ప్రధానార్థముగా శ్రీరామానుజులు గ్రహించిరని "ఇన్ద ఉభయసంబంధత్తై దేవదేవ దివ్యమహిషీమ్, అఖిలజగన్మాతరమ్- ఎన్ఱు శ్రీ శబ్దత్తుక్కు ప్రధానార్థమాక భాష్యకారరుమ్ అరుళిచ్చెయ్దారితే" అని పైన ఉదహరించిన అష్టశ్లోకీ వ్యాఖ్యానమున తెలుపబడినది. కావున ప్రస్తుతశ్లోకమున పూర్వార్ధములోని విశేషణములు రెండు శ్రీశబ్దమును వివరించుచున్నదని చెప్పవచ్చును.

శ్రీగుణరత్నకోశమున భట్టరు లక్ష్మీదేవిని "జనార్దనజీవికే" (46) అనుచు సంబోధించిరి. "జీవంతీ జీవనీ జీవా" అను వచనముప్రకారము మృతుని బ్రతికించు

ఔషధలతయే జీవిక. ఈ భావమే "దేవేశప్రాణనాయకీ" అన్న విశేషణము తెలియుచున్నది. "సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః, సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోపి గరీయసీ" అనుచు సీతాదేవినిగూర్చి శ్రీరామచంద్రుడు పల్కుట, హనుమంతుడు "అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్, తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి" అని వారిరువురనుగూర్చి పల్కుటయు ఇచట స్మరణీయములు. ఇట్టి ప్రమాణములు ఇంకను పలు కలవు.

లక్ష్మీదేవి జగత్తున కంతటికిని తల్లి. "త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా" అను విష్ణుపురాణవచనము, "మాతరం శ్రియమ్" అను శ్రీసూక్తసూక్తి, "లోకమాతరమ్" అను అష్టోత్తరనామమును ఇచట అనుసంధేయములు. ఇట్లు సహజ మాతృత్వమును కల్గిన లక్ష్మీదేవి చేతనులను రక్షించుటకొఱకు చేయు పలు ప్రయత్నము లను భట్టరు శ్రీగుణరత్నకోశమున (50-53) విస్తరముగా నిరూపించిరి. ఆర్ద్రాపరాధినులగు రాక్షసస్త్రీలను హనుమంతుని బారినుండి కాపాడుట, శరణు కోరిన విభీషణుని, కాకాసురుని శ్రీరాముడు రక్షించుటకంటె గొప్పది కదా! ఇది ఆమెయొక్క సహజమాతృత్వ ప్రయుక్తమైన వాత్సల్యమునకు మచ్చుతునక. "సీతా" అను ఆమె నామము "షిఞ్-బంధనే" అను ధాతువునుండి నిష్పన్నమైనదని చెప్పుటకు వీలుండుటచే ఆ నామమునకు బంధింపబడినదను అర్థమును చెప్పవచ్చును. "సుందరీ రఘునాథస్య సురస్త్రీదుఃఖశాంతయే, దశాననస్య భవనే దశమాసానువాస హ" అనునట్లు తనను శరణు వేడిన దేవకాంతలకొఱకు ఆమె తనకు తానుగా లంకలో పదినెలల కాలము చెఱలో నుండెనను వృత్తాంతమునకు సీతానామము సూచకమని అభిజ్ఞులగు ఆచార్యులు వివరించిరి. కావుననే శ్రీ పిళ్లై లోకాచార్యులవారు శ్రీవచనభూషణ ప్రారంభమున "శిఱై యిరుక్కచ్చెయ్దవళ్" అని కాక "శిఱై యిరున్దవళ్" అని పల్కిరనియు వారి అభిప్రాయము. ఇట్లు ఆమె చెఱలో నుండుట, నూతిలో పడిన బిడ్డను రక్షింపగోరిన తల్లి తానుగా ఆ నూతిలోనికి దిగుటవంటిదని శ్రీమణవాళమహామునులు వ్యాఖ్యానించిరి. "ప్రజై కిణత్తిలే విழున్దాల్ ఒక్క క్కుతిత్తెడుక్కుమ్ మాతావైప్పోలే, ఇచ్చేతనర్ పిఱన్ద సంసారత్తిలే తానుమొక్క వన్దు పిఱన్దు ఇవర్కళ్‌పట్టతై త్తానుమ్ పట్టు క్కిడక్కైయాలే" ఇత్యాది వరవరముని వ్యాఖ్యాసూక్తి స్మరణీయము. మాతృత్వప్రయుక్తమైన లక్ష్మియొక్క వాత్సల్యము, క్షమలు అంత గొప్పవి. "మాతా సర్వలోకానామ్" కదా!

వేదమును "మాతృదేవో భవ" అనిన పిమ్మటనే "పితృదేవో భవ" అన్నది. ఈ



ప్రాధాన్యము జగన్మాత విషయమునకూడ వర్తించును కదా ! భట్టరు గుణరత్నకోశమున అమ్మవారివైభవమున స్తుతించుచు భగవానుని తత్సంబంధపూర్వకము సేవించెదమనిరి. "సంబంధదృష్ట్యా హరిం పశ్యేమ" - తల్లీ ! లక్ష్మీదేవీ! మేము నీకు మిథిలానగరములోని జనులవంటివారము. అందుచే భగవానుని నీ భర్తగా జనకుని అల్లునిగా గుర్తింతుము. శరణు వేడెదము- అనిరి. ఇట్లు భట్టరు పల్కుటలో గల స్వారస్యమును దేశికులు రహస్యత్రయసారము ద్వయాధికారమున వివరించుచు అంతఃపురమునకు చెందినవారు ఎట్టి నేరమును చేసినను ప్రభువు దానిని ఏదో ఒక నెపముతో కప్పిపుచ్చి, క్షమించును. అట్లే, శ్రీదేవి సంబంధమును కల్గినవారిగా తమను తెలుపుకొన్నచో భగవానుడు తమ అపరాధములెట్టివైనను క్షమించునని భట్టరుహృదయము- అని పల్కిరి. ఒకవేళ భగవానుని నిరంకుశస్వాతంత్ర్యము ఉద్రిక్తమై, చేతనుని అపరాధములను చూచి సహింపనని, శిక్షింతునని అతడు అనుకొన్నచో, ప్రక్కనే ఉన్న లోకమాత "కిమేతత్ ? నిర్దోషః కః ఇహ జగతి?" "ఇది యేమి? లోకమున తప్పును చేయనివాడెవ్వడు" అని పల్కి, ఆ స్వామి కోపమును ఉపశమింపజేసి, శరణాగతుని రక్షించునట్లు చేయును. అంతియే కాదు, భగవానుడు లోకరక్షణకై భూమి పై పలు అవతారములను ధరించినపుడెల్ల "రాఘవత్వే-భవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" అనునట్లు ఆ స్వామితో పాటు తానును అప్పటికి తగిన రూపముతో అవతరించుటయు మాతృత్వ ప్రయుక్తకార్యమే అగును. భట్టరు ఈ అంశమును కీర్తించుటయు మాతృత్వప్రయుక్త కార్యమే అగును. భట్టరు ఈ అంశమును శ్రీగుణరత్న కోశమున కీర్తించుచు "క్లిష్టం గ్రావసు మాలతీమృదుపదం విశ్లిష్య వాసో వనే" - మాలతీ పుష్పములకంటె మృదువైన నీ పాదములను అత్యంతము కఠినమైన తన భూమిపై మోపితివికదా ! లోకమీ మహిమను గుర్తింపలేకున్నదే ! అయ్యో ! - అని వాపోయిరి. ఇట్టి విశేషములను దృష్టిలో నుంచుకొనియే ప్రస్తుతశ్లోకమున కవి "జనన్యై సర్వదేహినామ్" అని పల్కిరనదగును. దేశికులును శ్రీస్తుతిలో "మాతా దేవి ! త్వమసి" అని, దయాశతకమున "సమస్తజననీం వందే" అనియు పల్కుట ఇచట స్మరణీయము.

11. సర్వాభీష్టప్రదాయిన్యై శౌరేః సర్వాశ్రితస్య చ ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

శౌరియగు భగవానునకు, సమస్తాశ్రితవర్గమునకు అన్ని అభీష్టములను ఇచ్చునట్టి ఆ శ్రీనివాసుని పత్నియగు శ్రీదేవికి మంగళమగుగాక!

లక్ష్మీదేవి సర్వేశ్వరునకు సర్వాభీష్టములను ఇచ్చుననుట ఆ స్వామి మనస్సును

తెలిపి, తదనుగుణముగా ప్రవర్తించుటయే. భట్టరు శ్రీ గుణరత్నకోశమున "మర్మస్పృశో రససిరావ్యతివిధ్యవృత్తైః కాంతోపభోగలలితైః లులితాంగయష్టిః, పుష్పావళీవ రసిక భ్రమరోపభుక్తా, త్వం నిత్య మభినందయసే ముకుందమ్" అనుచు లక్ష్మీదేవి భగవానుని మనస్సును రంజింపచేయుటను అభివర్ణించిరి. ఇట్లు భర్త అభిమతానుసారము ప్రవర్తించుటయేకదా ఉత్తమపత్నీత్వ లక్షణము. మఱియు, ఆమె ఇట్లు స్వామికి సర్వవిధ కైంకర్యములను చేయుటద్వారా అట్టి కైంకర్యమును చేసి, భగవానుని మనస్సును ఆనందింపచేయుటయే చేతనుని కర్తవ్యమను విషయమును తెలుపుచున్నది. లక్ష్మీదేవి తన సౌందర్య, లావణ్యసౌకుమార్యాదులద్వారా స్వామిని సమ్మోహితుని చేసి, తనకు అనుకూలునిగా చేసికొని, చేతనరక్షణమును చేయించును. ఒకవేళ అట్లు అతడు వశుడు కాకున్న, తగిన మాటలతో అతని మనస్సును మార్చును. ఇట్లు అతనిని "పురు-అధికం సనోతి ఇతి పురుషః" అనునట్లు పురుషుని గావించును. "పొరుళెన్నివ్వులకమ్ పడైత్తవన్" అనునట్లు భగవానుడు ఎప్పటికైనను ఈ లోకములను తనను చేరి, తరించునని ఆశతో సృష్టి చేసెను. ఆ ఆశ లక్ష్మీ పురుషకారముననే సఫలమయ్యెను. కావున ఈ విధముగా కూడ ఆమె ఈశ్వరుని సర్వాభీష్టములను నెఱవేర్చినట్లయినది.

"సర్వాశ్రితస్య సర్వాభీష్ట ప్రదాయిన్యై" అనుటకు శ్రీగుణరత్నకోశములోని "ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా కస్మైచిదంజలి భరం వహతే వితీర్య" అను సూక్తిని స్మరింపనగును. ఇట్లు లక్ష్మీదేవి సమస్తమైన ఐశ్వర్యమును, కైవల్యమును, మోక్షమును తనకు అంజలిమాత్రము చేసినవారికి అనుగ్రహించి, అప్పటికిని తృప్తి జెందక, వారికేమియు ఇవ్వలేక పోయితినే ! అని సిగ్గుపడునట. అట్టి ఔదార్యగుణమును కల్గినది ఆమె. "మోక్షచ్ఛేత్ జనార్దనాత్" అని, "చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవః చతుర్భుజః " అని భగవానుడే మోక్షదాయకుడని తెలియుచుండగా, లక్ష్మీదేవి పరమపదమును ఇచ్చుననుటలో అర్థమేమి? అనగా అందులకు ఆమె పురుషకారమును చేసి, సహాయపడుటయే. లోకమున ఒకరిచే దానమిప్పించుటలో మిక్కిలి సహాయపడినవారిని వారిపై గల ఆదరాతిశయముచే దాతగా పేర్కొనుట అనుభవసిద్ధమేకదా ! "వేరి మాఱాదపూమేల్ ఇరుప్పాళ్ వినైతీర్క్కుమే" అను ఆళ్వార్ల సూక్తి నిర్వాహముకూడ ఇట్టిదే కదా !

ఆశ్రితుల విషయమున లక్ష్మీదేవి చేయు పురుషకారము ఎట్టిదనగా- వారి స్వరూపమును వారికి ఎరుకపరచి, పరమాత్మను ఆశ్రయించుటలో సహాయపడుటయే. "పురు-అగ్రగమనే" అను ధాతువునుండి పుట్టినదిగా ఇచట పురుష శబ్దమును గ్రహించినచో జీవుని లక్ష్మి పురుషునిగా చేయును- అనగా- భగవదాశ్రయణమున



పురోగామి అగునట్లు చేయునను అర్థమును పురుషకార శబ్దమునకు చెప్పనగును. ఇట్లు చేతనుడు, భగవానుడు- ఇద్దఱును పురుషులగుటకు లక్ష్మీదేవియే కారణము. లక్ష్మీదేవియొక్క ఈ విధమైన పురుషకారము శాస్త్రసమ్మతము. సాక్షాత్తు భగవానుడే లక్ష్మిని పురుషకారస్వరూపిణిగా తెలిపెను. "మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతా మథః, లక్ష్మీః పురుషకారత్వేన నిర్దిష్టా పరమర్షిభిః, మమాపి చ మతంహ్యేతత్ నాన్యథా లక్షణం భవేత్" అని "అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాత్ లక్ష్మీపతిః స్వయమ్, లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ, ఏతస్యాశ్చ విశేషో-యం నిగమాంతేషు చ శబ్ద్యతే" అని మొదలుగా గల ప్రమాణము లిచట స్మరణీయములు. దేశికుల శ్రీస్తుతిలోని "అపన్నార్తిప్రశమనవిధౌ బద్ధదీక్షస్య విష్ణోః, ఆచఖ్యు స్త్వాం ప్రియసహచరీ మైకమత్యోపపన్నామ్" అను శ్లోకమును ఇచట భావింపనగును.

ఇట్లు కవి ఈ శ్లోకమున లక్ష్మీదేవి భగవానుని తన స్వరూపరూపగుణములతో రంజిల్లచేయుటను, ఆశ్రితులకు త్రివర్గములను సాక్షాత్తు ఇచ్చుటయే కాక, పురుష కారమును చేయుటద్వారా మోక్షరూప తురీయపురుషార్థ లాభమునకు కారణమగుటను ప్రస్తుతించి, అట్టి వైభవమును కల ఆమెకు మంగళమును ఆశాసించిరి. పూర్వశ్లోకమున భగవానునకు ప్రాణనాయకిగా చేతనులకు జననిగా తెలిపిన కవి అట్టి పత్నీత్వ, మాతృత్వ ప్రయుక్త కార్యములను ఇందు తెలిపిరనియు చెప్పనగును.

12. స్వామిపుష్కరణీతీరవాసిన్యై హరిణా సదా ।
తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్ ॥

స్వామిపుష్కరిణీ తీరమున భగవానునితోపాటు నివసించునట్టి శ్రీనివాసుని పత్నియగు శ్రీదేవికి (పద్మావతికి) మంగళమగు గాక !

"మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్, స్వామిపుష్కరిణీ తీరే రమయా సహ మోదతే" అను నిత్యము అనుసంధించు పురాణశ్లోక రత్నమిచట స్మరణీయము. ఇంతవరకును కవి శ్రీరంగనాయకి విషయమున పూర్వాచార్యులు పలువురు అనుసంధించిన విశేషములను పద్మావతీదేవి విషయమున అన్వయించి, స్తుతించిరి. ఇందు సాక్షాత్తు పద్మావతికిమాత్రమే ప్రత్యేకముగా తెలుపతగిన వైభవవిశేషము తెలుపబడినది. భట్టరు శ్రీగుణరత్నకోశమున "ఉదధిపరమవ్యోమ్నోః విస్మృత్య మాదృశరక్షణక్షమ మితి ధియా శ్రీరంగధామని మోదసే" అనుచు పరమపదమును, పాల కడలిని వీడి వచ్చి, శ్రీరంగమును నిత్య నివాసము చేసికొనుటకు కారణము తమవంటి భక్తులను రక్షించుటకు తగినదని తలచుటయే అనిరి. అట్టి భావమే ఇచట

ప్రస్తుతము, భగవానుని ప్రతి అవతారములో లక్ష్మీదేవి ఆ స్వామివెంట తానును తగిన రూపముతో అవతరించుట ఆశ్రితసంరక్షణార్థము అయినట్లే, అర్చారూపముననను భగవానుని విడువకయుండుటయు అందులకొఱకే. ప్రస్తుత శ్లోకమున "స్వామిపుష్కరిణీతీరవాసిన్యై" అను పదములోని 'ఇన్' ప్రత్యయము ప్రశంసార్థకమగుటచే స్వామి పుష్కరిణీ తీరమును ప్రశస్తమైన వాసముగా కల్గినదను అర్థము కలుగును. దీనివలన పరమపదముకంటె, పాలకడలికంటె స్వామి పుష్కరిణీతీరమునే గొప్ప వాసముగా పద్మావతీదేవి తలచెనని ధ్వనించుటచే, పైన ఉట్టంకింపబడిన భట్టరు సూక్తిలోని భావమిచట సంగ్రహముగా సూచింపబడినదని చెప్పవచ్చును. అట్లే, "హరిణా" అను తృతీయ ప్రయోగము 'సహో యుక్తే-ప్రధానే' అను సూత్రానుసారము స్వామి పుష్కరిణీతీరనివాసానుభవము ప్రధానముగా లక్ష్మీదేవిదేనని, భగవానుని అనుభవము అప్రధానమనియు ధ్వనింప చేయును, భగవానుని అనుభవముకంటె పిరాట్టి అనుభవమే ప్రధానమనుటకు శ్రీరామా యణములోని "వైదేహి! రమసే కచ్చిత్ చిత్రకూటే మయా సహ" అను శ్రీరామచంద్రుని వచనమును ("రమసే" అను ఆత్మనే పదప్రయోగము భావస్ఫోరకము) "కాంతేన బధ్నాసి భోగాన్" అను శ్రీగుణరత్న కోశసూక్తిని ప్రమాణములుగా గొనవచ్చును.

ఈ స్తోత్రమున అన్ని శ్లోకములలో ఉత్తరార్ధము ఒకే విధముగా నున్నది. "తస్యై" అను సర్వనామపదము ఆయా శ్లోకములలో పూర్వార్ధమునగల విశేషణములద్వారా అభివ్యక్తమైన అసాధారణ వైభవమును కల్గియుండుటను సూచించును. అట్లే, ప్రతి శ్లోకమున "వేంకటనాయక్యై శ్రియై" అను సామానాధికరణ్యమువలన పద్మావతికి - లక్ష్మీదేవికి కల ధర్మైక్యము తెలుపబడినది. నాయకీశబ్ద ప్రయోగము ఆమెయొక్క భగవత్పార తంత్ర్యమును, శేషత్వమును తెలుపుచున్నది. ఇందు ప్రతి శ్లోకములో "శ్రియై" అనుచు శ్రీశబ్దప్రయోగము చేయబడుట ఆ నామము పిరాట్టికి ప్రథమాభిదానము, ముఖ్యమైన పేరు అగుటయే కారణము. "శ్రీః ఇతి ప్రథమాభిధానం లక్ష్మ్యాః" "శ్రీరిత్యే వచ నామ తే" అను ప్రమాణము లనేకములు ఇచట స్మరణీయములు. భగవానుని స్వరూపము, వైభవమునకు నారాయణశబ్దము తెలుపునట్లే, లక్ష్మీదేవియొక్క వైశిష్ట్యమును శ్రీశబ్దమువ్యక్తము చేయును. శ్రీశబ్దముయొక్క గొప్పతనము అష్టశ్లోకీవ్యాఖ్యలో ఇట్లు వివరింపబడినది. "శ్రీ" శబ్దముచే "విష్ణోః శ్రీః" అనునట్లు భగవానునకు సర్వోత్కర్షము ఈమెవలన కల్గునని తెలియుచున్నది. అట్లే, "ఈశ్వరీం సర్వభూతానామ్" అనునట్లు పరమాత్మ పరమప్రణయి అగుటచే, ఆ ప్రణయిత్వము కారణమువలన తన విశ్వ రూపాదులతో ఎల్లప్పుడు అనుభవించుచున్నను, ఎప్పటికప్పుడు అపూర్వముగా తోచు,



విస్మయమును కల్గించు వైలక్షణ్యమును కల్గిన ఈమెను క్షణకాలమైనను విడువలేనివాడై సేవించుననియు ఏర్పడుచున్నవి. కావున ఈ శబ్దమువలన త్రివిధాత్మవర్గవ్యావృత్తి చెప్పబడినది. ఈ విశేషములన్నియు ప్రకృతస్తోత్రమున ఆ యా శ్లోకములలో అనుసంధింపబడిన విషయము నిరూపితపూర్వము. కావున ప్రస్తుతస్తోత్రము ఒక విధముగా శ్రీశబ్దవివరణమనదగును.

శ్రీ ప్రతివాది భయంకరం అణ్ణన్ అను ఆచార్యులు తమ అష్టశ్లోకీ వ్యాఖ్యలో శ్రీ శబ్దమునకు కల ఆఱు విధములైన వ్యుత్పత్తులను తెలుపుచు, వానిని "శృణాతి నిఖిలాన్ దోషాన్ శృణాతి చ గుణై ర్జగత్, శ్రీయతే చాఖిలం నిత్యం, శ్రీయతే చ పరం పదమ్, శ్రీ యంతీం చ శ్రీయమాణాం చ శృణతీం శృణ్వతీ మపి" అను సంగ్రహశ్లోకమున సూచించిరి. ఈ నిర్వచనములన్నియు ప్రకృతస్తోత్రమున సూచింపబడుటను ఇట్లు తెలుపవచ్చును.

1. శ్రయతే భగవంతమ్ ఇతి శ్రీః -- భగవానుని నిత్యము ఆశ్రయించియుండునది. ఇందులకు "శ్రీనివాసభుజామధ్యే". ఇత్యాది ప్రయోగములు ఉదాహార్యములు.

2. శ్రీయతే చేతనైః ఇతి శ్రీః -- చేతనులచే ఆశ్రయింపబడునది. "సర్వాశ్రితస్య" ఇత్యాదులు ఇందులకు ఉదాహరణములు.

3. శ్రావయతి ఆశ్రితవచనాని ఇతి శ్రీః - ఆశ్రితుల ప్రార్థనలను భగవానునకు వినిపించును.

4. శృణోతి సంశ్రితగిరః ఇతి శ్రీః -- భక్తుల ప్రార్థనలను వినును. ఈ రెండు వివరణములకు అనుగుణముగా, "శౌరేః సర్వాభీష్టప్రదాయిన్యై, జనన్యై సర్వదేహినామ్" వంటి ప్రయోగములను అన్వయింపనగును.

5. శృణాతి ఆశ్రితదోషాన్ -- ఆశ్రితుల దోషములను హింసించును. అనగా నశింపచేయును. "అశ్రుతానంతదురితక్షాళనం యద్విచింతనమ్" అను ప్రయోగ మిచట ప్రమాణము.

6. శృణాతి గుణై రాశ్రితాన్ -- ఆశ్రితులను గుణములతో వృద్ధి పఱచును. అనగా- వారి గుణములను పెద్దగా చేసి, వారిని భగవానుడంగీకరించునట్లు చేయును. ఇందులకు "చరాచరమిదం సర్వం -- సుఖోత్తమమ్" ఇత్యాదులు స్మరణీయములు.

ప్రస్తుత మంగళాశాసనస్తోత్రమున భగవానునికంటె లక్ష్మీదేవి వైభవము ఎక్కువ

అని వర్ణింపబడినది. సర్వాధికుడు భగవానుడై యుండగా, ఇట్లు లక్ష్మిని ఎక్కువ చేసి పల్కుట ఎట్లు సమంజసము? అను ప్రశ్నకు సమాధానముగా రసఘనమైన భట్టరు పల్కిన ఈ సూక్తిని గ్రహింపవచ్చును. "శ్రియః శ్రీః! శ్రీ రంగేశయ! తవ చ హృద్యాం భగవతీం శ్రియం త్వత్తోప్యుచ్చైః వయ మిహ ఫణామః శ్రుతరామ్, దృశౌ తే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః పునః హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కంచుకశతమ్" (లక్ష్మికిని లక్ష్మియైనవాడా! స్వామీ ! నీకును ఇష్టురాలైన శ్రీదేవిని నీకంటె ఎక్కువ చేసి పొగడెదము. జాగ్రత్తగా వినుము. మా కీర్తనలవలన నీకు కల్గిన ఆనందాతిరేకము కారణముగా నీ కన్నులు వికసింపవలెను. వందలవేలాది కవచములైనను పగులునట్లు నీ ఒడలు ఉప్పొంగవలెను.) ఈ శ్లోకమునుబట్టి లక్ష్మీవైభవమును ఎక్కువచేసి వర్ణించుట భగవానునకు ఇష్టము. కావున అది భగవానునకు చేయు కైంకర్యములోనికే చేరును. ప్రాప్యమే అగును. ఈ శ్లోకమును శ్రీమాన్ రామకృష్ణ అయ్యంగార్ వ్యాఖ్యానించుచు చక్కని ఉపపత్తిని చూపిరి. ఆచార్యప్రాచార్యులు ఇద్దరి సమక్షమున ప్రాచార్యుల కానందము కల్గునట్లు నడచుకొనుటయే శాస్త్రసమ్మతము, కర్తవ్యమును భగవానునకు తన స్తుతించుటకంటె లక్ష్మిని స్తుతించుట మిక్కిలి ప్రీతికరము. భగవానుడు, లక్ష్మీ దేవియు కలిసియున్నప్పుడు భగవానుడు ప్రాచార్యకోటిలోనికి, లక్ష్మీదేవి ఆచార్యకోటిలోనికి చేరుదురు. ఇట్లు భగవత్సమక్షమున లక్ష్మీవైభవమును ఎక్కువ చేసి పొగడుట సంప్రదాయసిద్ధమే అగును. శ్రీనివాసాచార్యుల వారి అష్టశ్లోకీ వ్యాఖ్యానమున భగవానునికంటె లక్ష్మీదేవికి ఆధిక్యమును తెలుపు ప్రమాణముల సామంజస్యమునుగూర్చి, ఆమెయొక్క పురుషకారము స్వరూపవిరుద్ధము కాకుండుటనుగూర్చి, భగవానుని అతిశయమునకు ఎట్టి లోపము లేకుండుటనుగూర్చి, చేయబడిన వివరణ మిచట సందర్భానుగుణమను అభిప్రాయమున ఇంచుక ప్రస్తుతింపబడు చున్నది.

స్వామికి శేషభూతయైన లక్ష్మీదేవివిషయమున ఆపాతతః ఆ భగవానునికంటే ఆమెకు ఆధిక్యమును కలదని తెలుపు ప్రమాణములున్నచో అవి భగవానుని ప్రణయిత్వ నిబంధనమైన పారతంత్ర్యమును తెలుపును. "పిత్తర్ పనిమలర్‌మేల్ పావైక్కు" (పద్మనివాసిని విషయమున ఉన్మత్తుడు) అనునట్లు ఈమె విషయమున భగవానుడు మిక్కిలి ఆకృష్టుడై, "కిళర్ పొఱియ మఱి తరియదతనిన్ పిన్నే పడర్న్దాన్" అనునట్లు అనంతరము ఏమి జరుగునో ఆలోచింపక, కృత్యాకృత్యవివేకము లేక కార్యమును చేయునట్టివాడై, దేశకాల వస్తువులచే ఇంతటిదని తెలియరాని స్వరూపమును పరిచ్ఛేదించి పల్కినను, అట్లు కొలుచుటకు వీలుపడని ఆమె భోగ్యతాతిశయమున స్వామికి కల



ప్రణయిత్వ పారతంత్ర్యమునే ఆ ప్రమాణములు తెలుపును.

అయినచో, భగవత్‌పరతంత్ర అగు లక్ష్మీస్వరూపమునకు సమప్రధాన కృత్యమగు పురుషకారము విరుద్ధము కాదా? అనినచో, స్వతంత్రుడగు ఈశ్వరుడు తన నిరుపాధికమైన సౌహార్దగుణముచే చేతనులకు తనపట్ల అద్వేషము మొదలగు సకలములైన ఆత్మ గుణములను కల్గించి, ఆచార్యసమాశ్రయణమును కలుగజేసి, దానిద్వారా ప్రాప్యము (భగవత్కైంకర్యము) యొక్క మహిమను తెలిపి, సంసారములోని దోషములను విశదపరచి, పురుషకారపూర్వకముగా ఇతడు ఆశ్రయింపతగునని సంకల్పించుటచే ఆ సంకల్పాను సారము శ్రీదేవి చేతనులు భగవానుని ఆశ్రయించునట్లు చేయును. కావున స్వామి హృదయమును అనుసరించి, పురుషకారమును చేసి, శేషియగు ఈశ్వరునకు శేషవస్తువైన చేతనుడు స్వామికి లభించునట్లు చేయగా, అతడును వారిని రక్షించును. ఇట్లు లక్ష్మీదేవి భగవానుని స్వరూపరూపగుణములకు అతిశయమును కల్గించుచున్నట్లయినది. శేషికి అతిశయమును కల్గించుటయేకదా శేషత్వ, పారతంత్ర్యముల ఫలము. కావున పురుషకారము స్వరూపవిరుద్ధము కాదు.

అయినను, సర్వస్వతంత్రుడగు భగవానునకు వేఱొకరివలన (శ్రీదేవివలన) అతిశయమును కల్గుననుట అనురూపముకాదు కదా! అన్నచో, ఆమెకు భగవానుని స్వరూపములో చేరినదియై యుండుటయే స్వరూపము (వస్తుత్వము) కావున, అన్యత్వము అనగా- భగవానునికంటె వేఱగుట లేదు. కావున భగవానునకు అన్యాధీనవిభవమను కొఱత లేదు. ఆ విభవము స్వాధీనమే అగును. ఇందువలన అనురూపమే అగును. ఈ అర్థమును భట్టరును "స్వతః శ్రీ త్వమ్" అనుచు పల్కిరి. చేతనరక్షణోన్ముఖుడగు భగవానుని అభిప్రాయమును అనుసరించుట మాత్రమే ఈమె చేయు పని? అని అన్నచో, ఇక పురుష కారవిషయమునుగూర్చి ఏమనవలెను? అన్నచో, స్వామిచే రక్షింపబడవలసినవాడగు చేతనునకు తాను అంతకు ముందు చేసిన అపరాధములవలన కల్గిన భయము తీరుటకై ఈమెను ఆశ్రయింపవలసి యుండుటచే, మఱియు, "లక్ష్మీదేవి చేతనుల అపరాధములను నాచే మన్నింపజేసి, నా వద్దకు చేర్చిన నేను వారిని క్షమించి, గ్రహింతును"- అను భగవానుని సంకల్పమువలనను లక్ష్మీదేవి చేయు పని పురుషకారమగుటలో లోపము లేదు.

ఇట్టి నిరూపమానవైభవమును కల్గిన శ్రీదేవియొక్క అవతారమగు పద్మావతీదేవికి మంగళమును ఆశాసించు ప్రస్తుతస్తోత్రమును రచించినవారెవరు? అను విషయము స్పష్టముగా తెలియుట లేదు. ఈ స్తోత్రము చెన్నై నగరములోని అడైయార్

గ్రంథాలయములో లభించుచున్నది. ఇంతవరకు వెలుగుచూడని ఈ స్తోత్రమును వ్యాఖ్యానించుట పూర్వజన్మ సుకృతము.

తస్యై వేంకటనాయక్యై శ్రియై భవతు మంగళమ్.

**యతిరాజనాథవల్లీవల్లభ! కేశవ! మయా-ర్పితం భక్త్యా ।**
**అభినవభూతపురీశ్వర! వ్యాఖ్యాకుసుమం గృహాణ కృపయేదమ్ ॥**

卐卐卐卐卐